

# శ్రీ మాధవవర్మ

(విజయవాడ సామ్రాజ్య చరిత్ర)



సహజకవి : కవిపాదుషా
కొప్పరావూరి సత్యనారాయణ



కవిపాదుషా ప్రచురణలు
సుహాసినీమహల్ :: రంగన్నవారివీధి :: విజయవాడ-1.

మొదటి ముద్రణ
మే 1960
1000 ప్రతులు



మూల్యం 2-50

శోధనయందునూ, రచనయందునూ, అన్నివిధములా నాకు తోడ్పడిన

పెమ్మరాజు భానుమూర్తిగారికి

కృతజ్ఞత





## శ్రీ తిరుపతి వేంకటేశ్వరస్వామి పాదపద్మములకు

॥ తానువరించివచ్చిన సుధామయ సుందరధీ కవిత్వ క
న్యా నవరత్నశోభిత సుహాసినిఁ; మాధవవర్మరూప సం
ధానముచేసి, వ్రాసి, కవితాసముదాయము వహ్వారేయనన్
కానుకనిచ్చితిన్ గొనుము కావ్యము తిర్పతివేంకటేశ్వరా॥



భక్తిపురస్సరముగా, కృతి నొసంగుచున్నాను.

॥ కలియుగదైవమా కలియుగమ్మున నాకలి, నాకలీవిధ
మ్ముల కలగాకలంగతలపోసిన మాయహయాముఛాయ భ
క్తుల కడసాగనీక, వరదుందుభి సందడిచెంద, మా మన
మ్ముల కనికారినైతివి ప్రభూ శుభదాయక వేంకటేశ్వరా॥

రచనకు దోహదమొసంగినవి.

ద్రాక్షారామ శాసనము
పోలమూరు శాసనము
క్షీరా రామేశ్వరాలయ శాసనము, పాలకొల్లు.
వేల్పూరు శాసనము
విజయవాడ శాసనము
నాచికేతూపాఖ్యాన కృతి పరిశంస.
చాటుపద్య మణిమంజరి 2వ భాగము
పంచతంత్ర కృతిపతి పరిశంస
విశ్వనాథ సత్యనారాయణగారి ఆంధ్రప్రశస్తి
తమ్మన వెంకటేశ్వరరావుగారి "మాధవవర్మ"

—యువిగాక్ష, మల్లంపల్లి
సోమశేఖరశర్మగారి వ్యాసములు—

1



# రాజా మాధవవర్మ

హేమంతము వెడలిపోయినది. వసంత మరుదెంచినది మనోహరమగు కోర్కెలనేకము, మనమున పూరించుకొన్న గండుకోయిల మృదుమంజుల మధుర కూజితము వర్షించి, పుష్పించె నాయన. పుష్ప ఫల వృక్షములు చిగిర్చి, వసంత కన్యకు పూర్ణస్వాగతమును ప్రసాదించుటకు యత్నించు చున్నవి. మధురాధరముల కురిపించు పుష్ప రాజముల యౌవనము నాస్వాదించుటకై బంభర సముదాయము. ఆశశక్తితో ఆవేగముతో అరుదెంచి, పూవునకొకటి వ్రాలి పుష్పకన్యల స్త్రీత్వమును భంజింప చేయుచున్నవా అన్నట్లు వాని ఝుంకారములు ఘోషిల్లుచున్నవి. వాని ఝుంకారము, పొదలమాటుననుండి ఏదో అనిర్వచనీయత్వ మావహింప, అర్ధ నిమీలిత నేత్రులై ఒండొరుల కన్నుల చూచుకొను నూత్న ప్రేమికుల హృదయములను మరింత వేగముగా స్పందింప చేయుచున్నవి. కేవల ముగ్ధ జలజాధర దళమ్ముల ముద్దు వెట్ట కఠిన హేమంత హిమవాలుకా పథమ్మున నవతరించి వచ్చు వసంతకన్యకు స్వాగతగీతి పాడుచున్నవా యన్నట్లు నాటి శారదసంధ్య యొప్పుచుండెను.

ఉ॥ చైత్రము, కోకిలమ్ముల ప్రచారనినాద సరాగభోగ స
న్మిత్రము, పుష్పసౌరభము మించి తమించగ జంచరీకస

త్పాత్రము, బాలచూత నవపల్లవకోమలి కావ్యకన్యకున్
నేత్రము, విశ్వదృశ్యరమణీయ సుహాస వికాస పత్రమున్॥

ఉ॥ కమ్మని పూలవాసనలు గ్రమ్ముకొనంగను వేపమ్రాకు నా
కమ్మన గమ్మగమ్మనుచు గ్రమ్మిన కమ్మనితమ్మిపూలపు
ట్టమ్ముల గట్టి కన్పడియె డాలు కడాని మెఱుంగుతోడ, న
మ్రమ్మున గన్న సత్కవుల భావములల్లన బల్లవింపగన్॥

మ॥ ప్రజలానంద సుఖాతిరేకమున సౌభాగ్యమ్ములంకార ది
వ్యజిగీషాభ్యుదయాంతరంగములతో నవ్యక్తసువ్యక్తరూ
పజనాధీశులు పోలె పండుగలు పబ్బాల్ చేసి వైవాహిక
ధ్వజమెత్తుదురమ్మనీదయను చైత్రమ్మా, వసంతాఖ్యమా॥

మ॥ ఘనసార స్ఫురణానురూప కవితాగా నప్రసూనావళిన్
గొనియున్ లోక విశాలమౌ రథముపై గూర్చుండగా జేసి యా
లనవోన్మేషజిగీషసుందరరసాహ్లాదావనంబందునన్
జనసందోహము వహ్వారే యనగనో చైత్రమ్మ రాజిల్లవా?

సీ॥ బంభరనాథ విజృంభణ. మంగళ
వాద్యమ్ము సన్నాయి పాటగాగ
దాళువా మాగాణిలో లలనామణుల్,
కూలికాంతల తలపూల సొగసు,
లేతమావి చివుళ్ళ మేతమేసిన గండు
కోయిల హాయిగా గూయుసొంపు
సోమార్క సాహార్ద్ర సూచనన్ వేడియు
చలువయు సమముగా జలుపు తీప్పు

గీ॥ మంచుబిందువుల్ గరికపై మంచిముత్య,
ములను మించగా తళతళల్ పొలు పుగొలుప
నవవసంత ము దెంతయో రవళి చెలగ
విశ్వమానవ కళ్యాణ విధముగాక॥

సీ॥ నీ మూలమునగదా, సామూహికమ్ముగా
బిక రాజ సంగీతవిభవమెచ్చె
నీ మూలమునగదా, ప్రేమమై ప్రకృతి సౌం
దర్య సౌభాగ్యము ధన్యమయ్యె
నీ మూలమునగదా నిఖిలా వనీ చక్ర
సుమరాజి సౌరభ శోభమించె
నీ మూలమునగదా నిస్వార్థపండిత,
కవిచంద్ర జయకీర్తి కాంతబరగె

గీ॥ నీవినా సుధామధుర సుహృద్య దివ్య
భవ్య సర్వోదయ ప్రద స్వర్ణ రత్న
ఖచిత సింహాసనంబు సుకాంతు లీను
నవ్య కావ్య సృష్టియె లే చైత్రకాంత॥

సీ॥ కేయూర కంకణ కుండల స్వర్ణ
మంజులత్వంబులు సింజనము
గండ పెండెర పాదకాంతి గాన ప్ర
శస్తమై భాను తేజంబు మయ
సంజ కెంజాయల స్వర్ణదుకూలాల
గాశ్మీర శాలువా రశ్మిమించ

సంస్కృతాంధ్రాంగ్లేయ సాహితీ వార్ధుల
సమమంచు కోరమీసములతిప్ప

గీ॥ సూక్ష్మ చైతన్య విస్తృతా నూన చతుర
సకల సంగీత నృత్య విజ్ఞాన శాస్త్ర
కవితలల్లంగ కవులు నీ కతనగాదె
నవవసంతమా, చైత్రమారామలక్ష్మి!

మ॥ సుమియింపన్ మలయించు కుంజతను విష్ణు
(క్రాంత లేబాళ్ళయ ప)
త్రములా శార్వరి రాక నవ్వడికి నాత్రమ్మున్ బ్రిద
(గ్గింప నీ
మముతో నేగు వికారి చందమున సంభ్రమ్మాదళ
మ్మందునన్)
సమమై ముద్దుకొనంగ వందనముచేసాగెన్, వసం
తాఖ్యమా॥)

చం॥ వరుణుడు వాయువున్ మఱియు భానుడు సోముడు
తీవ్ర రూపమున్)
గరునము మట్టువెట్టి సమఖండములో రహినుంచి
కట్టి, యీ)
ధర పరిపాలనమ్ము సుఖదంబగు నట్లొనరించునట్టి యో
వర కరుణా చరాచర విభాసగుణా భరణా వతం సమా॥

మ॥ అది వైశాఖ కవోష్ణ చండకరుడా యాకాశ సౌధాళిపై
నధి రోహించినవేళ తోట్టతోలుతన్ బ్రాప్తించు
(నారోగ్య శా

ప్రా దినాసుందరి గున్నమావుల రసాస్వాదమ్ము
( జేయింప నా
స్పదమా శారదకాంత గొప్పె. ధరణీ సామ్రాజ్య
( రాజత్ప్రభా॥

గొప్ప మహాత్ములకును, నిరంతర మహా తపస్సంపన్నులు కేవల శక్తిమూ[illegible]లు ఏకాగ్రతా దృష్టిని యుక్తులౌ, యోగులకు సైతము తెలియని-కనీసము యోచింప నీలు లేనిదియునగు నీయది, నిర్మల, నిశ్చల, నిర్వికారామ, నిరంతర యోగ నిద్రయందుండి దరహాస వదనమున యోచించుచు విశ్రాంతి గొనుచున్న జలజాక్షీ హృదయాధి నాథునకు. హఠాత్తుగా నతని భావజలధియం దుదయించిన. తన భావ రమణీయ హాసవిలాస వికాస రేఖలతో, మంచు వేసవి నిండు గుండెనుండి మృదుమధుర వసంతమును పిండి — దశ దిశలకునూ విశ్వశాంతి దరహాసవీణా సుకుమార సుహాసిని కాంతిపుంజ నిరంతర మందహాస రసహాసము లొలికించెనీ గంటుకోయిల, నవచూత పీఠనావరించిన పొదలకు రాణియై వసంత సామ్రాజ్ఞియై భావుక చక్రవర్తినియై. నవ వన వసంతమును చిల్కరించుచు — సామాన్యదృష్టి కగోచరమై, ప్రకృతి యందొక ఆకార స్వరూపము లేనిదై, కులికించి యొల్కించిన రసప్రవాహ తరంగములు, నల్దిక్కులకును, ప్రఫుల్ల హర్షరస ప్రసూన నవరత్న ఖచితమణి మండల ప్రభాసమును ప్రభాతము చేయుటచే యా అరిభీకర జడ శిశిరమును

నిస్పృహాన్విత విగతాశా విచార కాళరాత్రిని పారద్రోలి వసంతము వృష్పించుచున్నది.

వైశాఖపు ఉషస్సు, పాలకడలినుండి చెలరేగిన వేయి పగడలవలె విన్పించునట్లు రంగారున సాగుచుండెను. మనోహర హరిణ శాబకములు తల్లుల వెంట పర్వెత్తుచు. కెంజిగురాకు హస్తములకు, సొంపు నింపుచూ,ముద్దులు గూర్చుచున్నవి.

కృష్ణవేణీ నదీమతల్లి ఏకవీరయై క్షీణించుట కారంభించెనా యనునట్లు ప్రవాహ వేగముతగ్గి, శాంత స్వరూపిణియై. ఆనంద రస ప్రవాహామునదేలు ప్రేయసీ ప్రియుల ముగ్ధభాషణలవలె మందగమన యానము సాగించుచున్నది.

వైశాఖము ఆకారములేని పరమాత్మకేగాక సాకార జీవాత్మలకుకూడ మహోన్నత పర్వమైనది. ఈ మాసము ననే గార్హస్థ్యము స్వీకరింప యువతీ యువకులు ఏకధాటిని సన్నధులగుదురు. అకుర దరహాసమై, మంజుల మరాళమై, ఒయ్యారి మయూరమై హృత్ప్రిబంబాలికించు, గండుకోయిల స్వామి, కవి సామ్రాట్ కావితీగాన మరందము లొల్కించుచు, స్వాగతగీతు లాలపింప, ఆ మాసము ఆనందోత్సాహాములతో మెల్లన సాగుచుండుటచే, తెల్గుల హృదయములు నిండినవి కాన ఆంధ్ర పరమ ప్రఫుల్లహృద యయినది.

పదార్థము నిర్జీవము. నిశ్చలము. దానికి శక్తినీయగల శక్తి యొక్క స్వయం భూశక్తికే యున్నది. సృష్టి స్థితి లయ

కాముల అన్యోన్యసేవా ఫలితమే నేటి మహా మానవయుగము.
పదార్థము పరమాత్మయం దంతర్భాగమే

సృష్టి లయములలో నుద్భవించిన నాదమువోలె, ఆరంభమున ఒంటరితనము భరించలేక ప్రకృతిని, ప్రపంచాన్ని సృష్టించారు. ప్రజాపతి అనాదిసిద్ధుడు. సకల చరాచరసృష్టి యాతని కరుణార్ద్ర కటాక్ష వీక్షణలోనే జరిగినది. పరమ శివుడై, భక్తులపాలిటి వరములనిచ్చు వేల్పై, దుష్టనాశనమునకు నాందియై — విశ్వ మానవ హృదయాలను ప్రేమ పూరితముచేయ సమకట్టి, ప్రేమతత్త్వము బోధించుటకా యన్నట్లు, అర్ధనారీశ్వరుడై యొప్పుచుండెను.

జగద్గురు శంకరాచార్యుల జగత్తు మిథ్యయను మాయావాదం పండిత పామరుల నంతగా నాకర్షింపలేక పోయినను—అహం బ్రహ్మాస్మి 'అనునతని అహంకార పూరిత అద్వైత సిద్ధాంతము, భావవాద సిద్ధాంత మేధావంతుల హృదయములకంత తృప్తి నివ్వలేక పోయినను, నాడద్వైత సిద్ధాంతము గౌడపాదుని కారికలు విశేషవ్యాప్తమై యున్నవి. ఆంధ్రప్రాంత మంతటను శైవాలయములు, వ్యాసపీఠములు విరివిగా గలవు.

మాధవవర్మ సామ్రాజ్యమున వీరశైవము ప్రజా హృదయముల నాటుకొనియుండెను. జంగములకు, బసవేశ్వరులకు నాడత్యంత ప్రాధాన్యము ఈయబడెను — తేజోవంతమైన శివలింగము గలదియూ, పంచారామములలో ఒకటైన

శ్రీరారామ దేవాలయము, విష్ణు కుండినవర్ధన వంశస్థుడగు శ్రీ శ్రీ శ్రీ హరిశ్చంద్రవర్మ మహారాజుచే, శెల్లుల తలమానిక మనదగుదానిని, అభ్యుదయ శాలివాహనశకం 1312 దుర్ముఖి నామ సంవత్సరాన నిర్మింపబడెను. ఈ విషయము శ్రీరా రామాలయ శాసనము ద్వారా మనము నిర్ణయింపవచ్చును

నాటి స్త్రీపురుషుల హృదయములు కరుణార్ద్రములు. హర్షరస ప్రసూనములు. వృత్తుల జూచుకొనుచు, అవసరముల కరవాలము ధరించి కదనరంగమున కురుకుచు, ధైర్యస్థులై నిరంతరము దేశరక్షణా కార్యక్రమములయందే నిమగ్నమై యుండెడివారు కావుననే నాటి రాజ్యము స్వయం పోషకత్వ ప్రధానమై యొప్పినది. ఆబాలగోపాలముల మనములు శాంతిబూరింప ప్రశాంతి రాజ్యమేలుచుండ, ప్రసన్న హృదయులు పరిరక్షించుచుండ, వారెల్లవేళలా నొక ప్రకృభక్తి కొనుచునే పురోగతీ కార్యములయందు మునిగియుండెడివారు. ప్రసన్న వదనమున ప్రజాపతి కరుణహస్తా లాలనలో, అనంతాంబర వీథిలో పునీతానంద రసప్రవాహ తరంగ లాస్యములో, విశ్వశాంతీ సముద్ధారిణియైన తాండవమూర్తి, తన అంకశయ్యయున్న పార్వతిని సకల మణిమయ రత్నస్థగిత స్వర్ణాసనంపై కూర్చుండబెట్టి, దేహము పులకరింప, సంధ్యా తాండవ నృత్యమును ప్రదర్శించుచుండెనా యన — నిత్య కళ్యాణము, పచ్చ తోరణముగా నాటిదేశ మొప్పుచుండెను.

ఒక అనిర్వచనీయానందము, రాష్ట్రమం దంతటను కన్పట్టుచుండెను. అల్లుళ్ళ పర్వమై యొప్పు సంక్రాంతి వెడలి

పోయినది. వైశాఖ మవతరించి, యువతీ యువకులను గార్హస్థ్యములను స్వీకరించుడని ప్రబోధించెనా యన్నట్లు వివాహములు జరుగుట మొదలాయెను.

వివాహమునకు నాడెంతయో ప్రాధాన్యత యుండెను. ఒంటరితనమును పారద్రోలి, నిరంతరానంద డోలికలలో నూయలలూగుట వరకే పరిమితమైయుండక, దేశ రక్షణా కార్యక్రమమును ప్రబోధించుటకొక కంకణమయినది.

ఈ మాసముననే రైతులు తమ ఏడాది కష్టమున సంపాయించిన ప్రతిఫలము నానందించుట కవకాశముకొరకునూ, తొలకరి వానలు చిల్కరించు సమయాన, చల్లే బీజముల సముపార్జనకై ఆత్రమునూ పడుచుండిరి. ఆ సమయముననే యితర దేశ రైతులు తమ తమ ప్రాంతములకు పోనుద్యుక్తులగుచుండిరి. జావా, సుమిత్రా, చీనా మొదలగు దేశముల నుండి అరుదెంచి, యిచట అత్యున్నత స్థాయి నలంకరించిన వ్యవసాయమును గూర్చిన పూర్ణజ్ఞానమును గ్రహించి, తమ తమ దేశములయందీవిధానమును ప్రవేశపెట్టుటకై అరుదెంచిన రైతులు, యిచట వారిని గౌరవించిన రైతుల నాలింగనము గావించుకొని, వీడ్కోలు గైకొనుచు విచారభరమున సాగి పోవుచుండిరి.

ఆనాటి ఆ భాగ్యము నేడెచ్చటనూ కానరాదు. పాశ్చాత్యుల పరిపాలన అంతరించినను, ఆ భావ దాస్యము మాత్రము, మనలను వదలక బాధించుచున్నది. ప్రతి యవసరముకొరకునూ, పరాయి ప్రాపుకొర

వలసిన దుర్గతి పట్టినది. సహజీవనం నాటి సహజ సంపద. పరస్పరం అర్థంచేసికొని ప్రేమించి దేశ సౌభాగ్యానికి నాందీ పలుకుట నాటి ప్రజల ప్రకృతి యాభరణం.

భాను మహాశయుని బంగారు హస్తాల తాకిడికి పైకి లేస్తూ, తేలిపోతూ మిలమిలా మెరిసిపోతూ, స్వచ్ఛమై, పావనమై, మత్తగజంలా మెల్లన సాగిపోతున్న కృష్ణవేణీమాత సభంగ జలతరంగ పరితోషితమై యొప్పు ఈ విజయవాటిక - విశాలమయినది, ఇది మా దేశం. సస్య సంపదున్మీలితం. ఈమె మా తల్లి, యిదే మా సౌభాగ్యం, నాజాతి రక్ష, అని తలిచే అమాయిక నిస్వార్థ జీవుల సముదాయము కావునసే, ఆరాజ్యము లలిత కళల కాలవాలమై, సహస్ర ముక్తాహారములు గళపీఠి నలంకరించుకుని ఝణఝణ నిక్వాణ నాదముతో చరించు ఆంధ్రమాతను తలచి పిలచి కొలిచే, ఆనాటి ధీర ఆంధ్రజాతి వీర విక్రమ పరాక్రమము నేడెచ్చట నూ కానరాకున్నది. మరి యీనాడో, పూర్వమంతా నాది గత మెంత ఘనకీర్తి గలవాడా యని అర్థంలేని తృప్తిపడుతూ. రొమ్ములు విరిచి తిరుగుతూ, ఆ నొప్పికే భరించలేక గోలెత్తేటంత నిర్వీర్యమయిపోయింది తెలుగుజాతి. ప్రజాద్రవ్యమును తమ విలాసాలకై, వినోదాలకై వెచ్చించు ఈనాటి నీచుల ప్రవర్తన నాడు మచ్చునకైననూ కానరాకుండెను.

శైవులమని వైష్ణవులమని తరతమ బేధాలను దృష్టి యందుంచుకొని నాశనమైన, పలనాడు కాకతీయ సామ్రాజ్యములవలెగాక విలయనృత్య పైశాచిక యుద్ధ భూమిని

నూకటి ప్రేళ్ళతో పెల్లగించి, విమలరూప తేజోదయ విశ్వ శాంతిని సముద్ధరించి, పునీతమై, పుష్కలజ్ఞాన సంపదతో పురోగమించినది నాటి ప్రజ - మంచినే గ్రహించి గౌరవించు నుత్తమ మానవ లక్షణములు వారు గల్గియుండిరి.

వ్యవసాయము నాటి ముఖ్యవృత్తి. వ్యవసాయాభివృద్ధికి మాధవవర్మ యెన్నియో విధముల పాటుపడి, నూత్న పరికరములు తెప్పించి రెండు పంటలు పండునట్లు అభివృద్ధి గావించి సస్యప్రమాణము, పరిమాణమును ఏర్పరచెను. ఇతర దేశ రైతులు వచ్చి యిచట వ్యవసాయ విధానములు నేర్చు కొనుటయూ జరుగుచుండెను.

ఆనాడాత్మ విశ్వాస కొరతతో గాని, మరే విధమునగాని ఏర్పడిన ఆహార సమస్యయూ లేదు, అవ్విధముగా నిర్ణయించుటయునూ లేదు. నిరుద్యోగు లసలు లేరు. అందరకునూ తమతమ యోగ్యతలననుసరించి వృత్తుల నేర్పరచినాడు మాధవవర్మ — తమ తెలివి తేటలను, సంపదను ప్రజా క్షేమమునకై వినియోగపరచుట మంచిదని యెంచి, సంపన్నులు, మేధావంతులు తత్పక్షమున కృషి చేయుటవలన దేశము సుభిక్షమై, రాజ్యముపావనమై, ప్రజకానందమై ప్రభువుకు శత్రుభీకరమై, భయంకరమై, నానా దేశ పూర్వసామ్రాజ్య మహాచరితతో తెలుగుల అనుంగుతల్లి యొప్పుచుండెను.

నాటి ప్రజకు ఆచార వ్యవహారములయందాసక్తి మెండు. వాటిని ఆరోగ్య శాస్త్రముతో సమన్వయ పరచు వరకే, పరిమితము చేసిరి. భక్తిమార్గమును అభ్యుదయపంథాకు

జోడించి, ముందడుగు వేయునట్లు మాధవవర్మ ఏర్పాటులు గావించెను. మత విషయములు, సామాన్యుల కర్థమగునట్లు వ్యాసపీఠముల నభివృద్ధి పరచి, తద్వారా మత చర్చలు జరిపించి, సర్వమత సామరస్యమునకై కృషిచేసెను — కాని అంతా కర్మ - అను నిర్వీర్యవు సిద్ధాంతీకరణీయుల ఆతడెన్నడునూ సహించి విడువలేదు.

శ్రీ భ్రమరాంబా మల్లేశ్వర దేవాలయము నాడుచ్ఛస్థితి యుండెను. పలువిధ అలంకారములు నిత్యమూ కూర్చబడి, కడు శోభాయమానమై, చూచెడివారిని హర్ష పులకితులను చేయుచూ, వారి గుండెలనిండుగా యేదో ప్రవహింపచేయుచున్నది.

హిందువులకు అధ్యాత్మిక చింతన యధికము. తెలుగులకు అధ్యాత్మిక వాదమెంతయో, భౌతిక వాదనయూ అంత దృఢముగా నుండియుండెను. విజయవాటికయందు శైవాలయములేగాక, విష్ణ్వాలయములు, ప్రచార పీఠములు పెక్కులుండుటచే, మాధవవర్మ మత సామరస్యమునకేగాక కుల వర్గ సన్నిహి తత్వమునకుగూడా పాటుబడి యుండెననుటకు చక్కటి నిదర్శనమై యున్నది.

పాకారి ప్రముఖైక నాయకునకు వైశాఖము అత్యంత ప్రియమైనది. సతీదేవి మరణానంతరము, పరమశివుడు విచార భరమున కృంగిపోయి, తన కార్య నిర్వహణమును మరచి, తపస్సు చేసికొనుటకై హిమవత్పర్వత ప్రాంతమున కరిగెను- ఆయన తపమాచరించిన స్థలమే నేటి గౌరీశంకర శిఖరము.

లయకారుడగు పరమేశ్వరుడు యిట్లు మౌనముగా జపమాచ రించుటగాంచి దేవగణములు ఆందోళనపడినవి —— రాక్షస బాధ మిక్కుటమాయెను, అపుడు దేవతలందరు విష్ణుపీఠమున కరిగి తమ బాధల మొరపెట్టుకోగా - అతడునూ పార్వతీ వివాహానంతరమున్నియూ సమసిపోవునని నుడువగా - వారా కార్యమును నిర్వహింపుమని మన్మధుని కోరిరి. పంచసాయ కుని సహాయమున, దేవతలు వైశాఖ పూర్ణిమనాడు శివ పార్వతుల వివాహము జరిపించి, విశ్వశాంతి కాముకులైరి.

ఈ కళ్యాణ మహోత్సవములను పురస్కరించుకుని, ఆంధ్ర దేశమందంతటనూ ముఖ్యముగా త్రిలింగ ప్రాంత మున, అత్యున్నత స్థాయిన వేడుక జరుపుకుందురు. ఈ మాసమం తయూ పురాణ శ్రవణమాచరింతురు. కళారూపములన్నియు, ఆ వైశాఖ మాసమునందు, దేవాలయ ప్రాంగణమునందు ప్రదర్శింపబడెడివి.

దేవాలయ ప్రాంగణమంతయూ సుందరముగా అలంక రింపబడి యున్నది. నానావిధ జనసందోహము ఉల్లాసమున అచటికరుదెంచి ఆ ఉత్సవమునకు మరింత వన్నె తెచ్చు చుండిరి. ప్రాకార బహిర్మంటపము నుండియే వేదఘోషలు విన్పట్టుచున్నవి —— వారి కంఠములు కడు శ్రావ్యములు. శ్రీభ్రమరాంబా మల్లేశ్వర దేవాలయ ప్రాంగణమే మహేంద్ర విశ్వ విద్యాలయమని పండితుల అభిప్రాయమై యున్నది.. రాజ్యమన్ని ప్రాంతములనుండియు విద్యార్థులచట కరుదెంచి విద్య నభ్యసించుచుండెడివారు. మాధవవర్మ విద్యార్థుల

కొరకెన్నియో వసతుల నేర్పరచియుండెను. ఈ మాసము విద్యార్థులకునూ ప్రీతికర మయినది. ఈ సమయము ననే గురువులు వారికి కామశాస్త్రము బోధించెడివారు—అనంతరమే వివాహములు జరిగెడివి. వారి యాదేశానుసారము ఆ ప్రాంగణమందే నాడు వివాహములు జరుగుచుండెడివి.

మంటపమునను విద్యార్థులు ప్రాథమికులు – కుల మత వర్గ విభేధములు విద్యార్జనయం దుండరాదని మాధవ వర్మ శాసించియుండుటచే అచట అన్ని వర్గములవారునూ యుండిరి. అదియునుగాక, విద్యార్థులయందు అమిత శ్రద్ధ వహించునట్లుచేయ, గురుపుంగవులకు కావలసిన గృహ వస్తు సంబారములన్నియూ రాజ్య శ్యాలకునిద్వారా పంపుచుండుటచే, మాధవవర్మ ఆచార్యవరుల యిక్కట్టులు బాపుటయే గాక, తన యుద్దేశ్యమునూ నెరవేర్చు కున్నవాడాయెను. నాటి విధ్యార్థులునూ గురువులయెడ వినయ విధేయతలుగలిగి చెడు అలవాట్లు లేక యుండిరి. చిన్న నేర మాచరించిననూ విద్యార్థి కను కఠినముగా దండింపబడెడివాడు. శ్రీసూక్తము హిరణ్యావర్ణాం, అనునది మోహనరాగమున యాలపించు చుండ, దేవాలయ ప్రవేశము గావించిన స్త్రీ పురుషులు వారిని గాంచి సంతోషాంతరంగులైరి. వారిని హృదయ పూర్వకముగా ఆశీర్వదించి ముందుకు సాగిపోవుచుండిరి.

అదియునూగాక, లక్ష్మీపుత్రులు, నగర వైశ్యాధిపతి యగు స్కాంధ గుప్తుడునూ – ఆర్థికశాఖా సచివులు ధన

గుప్తులునూ యీ కార్య భారమును భుజ స్కంధములపై మోపుటవలన ఆ యుత్సవములకు మరింత వన్నెవచ్చినది.

విద్యార్థి మంటపము దాటగానే పండిత మంటపము గలదు. ఇచటనే యుక్తవయస్కులగు యువతీ యువకులకు కామశాస్త్రమును బోధించెదరు. దాని నానుకునియే వివాహ వేదికలు గలవు. వాటిని కళ్యాణ మంటపములందురు. నేడొక వివాహము జరుగుచున్నది. వరుడొక లేఖకుడు, కడుబీద-తల్లి యొక వృద్ధురాలు, చింతకాయలమ్ముకొను సామాన్యస్త్రీ. ఆ యువకుడొక యువతిని ప్రేమించియుండెను. కాని ఆమె తలిదండ్రులా వివాహమున కంగీకరింపరైరి. ఈ విషయము తెలిసిన మాధవవర్మ ఆ వివాహము జరిపింపుడని తీవ్రముగా శాసించెను.

తదుపరి యొక విశాల వేదిక కలదు. అచట హరి కథలు జరుగుచుండును - నేడొక దాసుడు మారీచకథా వృత్తాంతమును గానము చేయుచుండెను. ఆతని కంఠము గంభీరముగా యున్నది—

" మిసమిసలాడే పసిడిలేడికై మిథిలా నందనువేడ "

యనుచు నృత్యము చేయుచూ, నడుమ హాస్య ప్రధానమగు చిన్న చిన్న కథలుచెప్పి ప్రేక్షకుల నవ్వింపచేయుచూ, కడు రమ్యముగా గానము చేయుచుండెను.

" నాథరో — కావలెను — అని సీతామాత బంగారు లేడిని కోరుటను, జయంతిశ్రీ రాగమున ఆలాపిం

చుచూ, తన సహజ ధీపటిమచే, రాబోవు ఆపదను లీలగా గోచరింపచేసెను. హరికథకు రాగ తాళ కథా నృత్యములు ముఖ్యము. అందేది లోపించిననూ కథ రక్తికట్టదు.

అది దాటినవెనుక యొక ఆరుబయలు ప్రదేశాన ద్విపదగానము జరుగుచుండెను. అయ్యది మహాకవి పాల్కురికి సోమనాథ విరచిత బసవ పురాణములోనిది. - జంగము దేవరలు ఆ ద్విపదను గానముచేయుచుండ గంగిరెద్దులు తాళనియమాల ప్రకారము నృత్యము చేయుచుండ యొక యుద్దండ పండితుడా కథను పురాణరూపమున పామరుల కర్థవంతము గావించుచుండెను.

వేరొక విశాల ఆవరణయందు యక్షగానములు జరుగుచున్నవి. ఒక విమర్శకుడూ, కథకుడు, హాస్యకాడుకల వారు ముప్వురు రమ్యముగా బాలనాగమ్మ కథను చెప్పుచుండిరి. అపురూప అందచందాలకు ప్రతిబింబమైన ఆబాలనాగమ్మకు యిప్పటివారు చెప్పుచున్న బాలనాగమ్మకు చాలా భేధమున్నది. వారి కథనము ప్రకారము నాగమ్మ పవిత్ర చరిత కాదు — క్షత్రియ కాంతయూ కాదు. ఆమె యొక గవళ్ళ స్త్రీకి, వాటాఖ్యుడు అను ఎరుకల నాయకుని వలన జన్మించిన అక్రమ సంతానము. వాటాఖ్యునివలననే విజయవాటికకు వాటాఖ్యపురియని పేరు వచ్చినదట — ఈ వాటాఖ్యుడు చరిత్ర ప్రసిద్ధి గాంచిన గట్టి బ్రహ్మయ్య నాయకుని ద్వితీయ కళత్ర సంతానము. (పాశ్చాత్యుల పాలనకు రోసి కత్తి ఎత్తిన కట్టబొమ్మన్, ఆంధ్రుడైననూ అరవదేశమునకు కార

కాంతరములవలన వెళ్ళియుండెను. (ఈ కట్ట బొమ్మన్ వంశ మూలపురుషుడే జగద్విఖ్యాత వీరుడగు గట్టి బ్రహ్మయ్య నాయకుడు) ఆ సమయమున కొండవీటిని కొండపల్లిని వడ్డె రాజులు పాలించుచుండిరి - వడ్డె " అను పదమునకు ప్రకృతి యేవర్ధి " కావున వీరే వర్ధి రాజులు - వారిలో యొక రాజు ఈ నాగమ్మను వలచి, బలాత్కరించి, బలవంతముగా తన అంతఃపురమునకు గొనిపోవుటవలన, సహజముగా మంత్ర శాస్త్ర ప్రవీణుడగు వాటాఖ్యుడు కోపించి, తన మంత్ర బలమ్మున ఆమెను తిరిగి తనవద్దకు రప్పించుకుని యిక ఇచటనుండ నిష్టములేక, నాగులమిట్ట ప్రాంతమునకు వలస వెళ్ళిపోవుచుండ — అతని శిష్యుడగు కిష్ణునాయకుడు అంతకు పూర్వమే నాగమ్మను వలచియుండుటచేత ఎదిర్చెను - గురు శిష్యులిద్దరూ ఆద్వంద యుద్ధమున మరణించిరి. అచటనుంచి బాలనాగమ్మ పారిపోవుచుండగా ఒక పులి వాతబడెననియూ ఒక జానపదగాధ గలదు. దానినే వారు గానము చేయుచుండిరి. యక్షగాన కథకుడు కథనంతాయూ యిందుమిించు దేవగాంధారి రాగముననే గానముచేసెను — దేవ గాంధారి రాగము పల్లెపదములు, జానపద గీతములు పాడుటకెంతయో బాగుండును.

ఆ ప్రక్కనే మరియొక విద్వాంసుడు తన గానప్రకర్ష చాటుచుండెనా యన్నట్లు మహాత్మా జయదేవుని గీతములు గానముచేయుచుండెను. జయదేవుడుపరమభాగవతోత్తముడు. అతనిభార్య పద్మావతి, యాతని అనుంగు ప్రియురాలు. నిరం

తర భగవధ్ధ్యాన నియుక్తుడగు జయదేవుని వాక్కునుండి వెలువడిన ఆణిముత్తెములే అష్టపదులు. అన్నియు రాగతాళ బద్ధములు — నాథ, హరే జగన్నాథ హరే — అతని కవన మద్భుతము. భావము నిగూఢము. నిత్య ఝురీప్రవాహము. కల్లోల సముద్ర తరంగములమించిన యాతని శబ్దసముచ్ఛయ ఘోష, పండితులనే, ముక్కుపై వ్రేలుంచుకొనునట్లు చేయు చున్నది.

గతమభిసారే - రతి సుఖసారే - భక్తి మార్గమును శృంగార రసమున మేళవించిన యేకైక భాగవతోత్తముడు.

మేఘైర్మేదురమంబరం — అనునాతని కీర్తనను చక్కగా యాలాపించుచుండ, అచటచేరిన ప్రజాసమూహము భక్తి తత్పరులై నాదమువిని తలలూపు నాగములవలె తల లూపుచుండిరి. అష్టపదులన్నియూ రాధా మాధవ ప్రేమ విహారములు, ప్రణయ కలహములు. సమయోచితముగా హిందోళ, తోడి రాగముల నాలాపించుచు, రాధా పరితప్త హృదయమునకు సానుభూతియూ, కృష్ణలీలలకు అచ్చెరువందు నట్లునూ చేయుచుండెను. కర్నాటక సంగీతముతో, హిందూ స్థానీ సంగీతమును మేళవించుటచే యాతని గానము మనో హరముగాయుండి, స్వరము మరింత సొంపులువారి, హృద యానందము కలుగచేయుచుండెను.

కొలది దూరములోనే పండితపీఠము గలదు. ఇచటనే కవిపండితులు సమావేశమగుట జరుగుచుండును. ఈదినము కవిసమ్మేళనము జరుగుచున్నది - మహాకవి శ్రీనాథ

సార్వభౌముని బావమరదియూ, బసవ భూపాలునికి మిత్రుడూ మహామంత్రియూనైన చెందలూరి గంగయామాత్యునికి ప్రియ శిష్యుడు నాచికేతూపాఖ్యానకర్తఅయిన మహాకవి దగ్గుపల్లి దుగ్గన్న ఆ సభ కధ్యక్షత వహించియుండెను. ఆమరుదినము నుండి నాచికేతూపాఖ్యాన కావ్యగానము జరుగనున్నది. ఆకారణమున సాహిత్యాభిమానులకు తన కావ్య ప్రాథమిక ఘట్టములను చెప్పుచుండెను. ఆ సభయందు సరసకవి సార్వభౌముడు శ్రీనాధ మహాకవియూ, పెసరు వాయాన్వయ వంశాబ్ధిచంద్రుడు, కాశ్యప గోత్రుడు, వయోవృద్ధుడూనగు చెందలూరి గంగయామాత్యుడు, జైమినీ భారతమును కృతి నందిన సాళువగుండ నృసింహరాయలు, ప్రబోధ చంద్రోదయమును విరచించిన నంది మల్లయ్య, ఘంట సింగయ్యలు, ఆ సభయందుండిరి. ఆదినము మాధవవర్మ మహారాజు వారందరిని సత్కరించెను. బసవ భూపాలుని మంత్రియగు అనంతయ్యయూ కొలది యాలస్యమున ఆ సభకు వచ్చెను - ఆనాడే మాధవవర్మ, నాచికేతూపాఖ్యానమును, కృతిస్వీకరింపవలసి యుండెను.

ఇవియన్నియూ దాటినపిదప గర్భగుడి యున్నది. పలువిధ సుందర, సువర్ణాభరణములతో, స్వామియు దేవియూ అలంకరింపబడియుండిరి. నాటిస్త్రీలు (మన స్త్రీలు విపరీత సన్నని వస్త్రములనడుమ అర్ధనగ్న ప్రదర్శనము చేయుచూ, పలువిధ అలంకరణములతో, దేవాలయమునకు వచ్చుట గాంచిన భగవద్దర్శనమునకని తోచదు.) పలు

విధ దేశీయాలంకారములు ధరించి సౌందర్యదేవత నాహ్వానించుచుండిరా యనునట్లు, స్త్రీలు చక్కగా ముస్తాబై వచ్చుచుండిరి - వారట్లు ఉత్సవ దర్శనార్థము వేడుకతోరా, వారిని దర్శించి కనీసము ఆ సౌందర్యమును నయనములతోనే సాధ్యమైనంతవరకూ ఆస్వాదించుటకరుదెంచిన సొగసుకాండ్ర సముదాయమునూ అచటచ్చట కానవచ్చుచున్నది. వారి అలంకరణలు సాంస్కృతీ ప్రతిబింబములై, చూచువారినాకర్షించుచున్నవి. వారి మెల్లని చల్లని చక్కటి ప్రక్కచూపులు ముదితల హృదయ కవాటములు తెరువ ప్రయత్నించుటచే, ఆమగువలునూ నిగ్రహించుకొనలేక, ఆయువకులపై మొహపు తీవలా యొక చిరునవ్వును విసరి చనుచుండిరి. కొందరుస్త్రీలు తమ తమ అవకాశములను సంజ్ఞలద్వారా తెలియపరచుచుండిరి. అనకాశము ననుసరించి మంటపములచాటుననూ, కుడ్యఛాయలలోనూ స్త్రీ పురుషు లొండొరులు ఉల్లాసాన సంభాషించుకొనుచు, నవ్వుకుంటూ సామీప్యము నను రాయుత్నించు సమయాన నవ్వడికాగా నిరుత్సాహులై వెనుదిరిగి పోవుదృశ్యములునూ మనకచ్చటచ్చట గానవచ్చుచున్నవి. విద్యార్థులు యీ విద్యయందునూ సార్థకతచెందు నుద్దేశ్యముతోనే కాబోలు, ఏవో వ్రాసిన పత్రములను, ఆనందోత్సాహమున ఆసందోహమున ఏపడతికో అందించి తృప్తిపడి వచ్చుచుండిరి. కొందరిట్లుండ మరికొందరు ఈ అసహ్యమును భరించలేక తమపైబడిన యువకులను నానా రకములుగా దూషించుచూ బాషకుగల తిట్లకొరతను తీర్చుచుండిరి —

ప్రాంగణమున యిట్లుండ, ప్రాకార బహిర్ద్వారమున ప్రచ్ఛెలకొరకై అరుదెంచిన చోరకళా నిపుణులు, యుత్సవ సందర్భమున జరుగు హరికథల నాకర్ణించి ముక్తి సాధింప వచ్చిన పూర్వ సువాసినులు, మొదలుగాగల నానా భాషతు జనసందోహమ్మున దేవాలయ మొప్పుచున్నది.

ఈ కాలముననూ యిట్లే యున్నదికదా-కారణమేమా యని సందేహము రావచ్చును. యుగాలనుండి వస్తున్న ఆచారాలకు తలలొగ్గి యిష్టతలేని పురుషునితో గార్హస్థ్యమును స్వీకరించిన యిల్లాండ్రు వివాహమనే బలిపీఠంపై ఆహుతయిన యజములబోలు నోరులేని నారీమణులు - ఏవో ఆశలు తమ మనముల నూహించుకుని అవి తీరకపోగా తమ జీవితాలను నిర్జీవము చేసికొని నాశనమయిన అతివలు - భార్యల తృప్తి పరచలేక పరనారీ పరిష్వంగముకోరు పతితులు, సౌందర్యాన్వేషణకై అరుదెంచిన సుందరులు - ఈ అవకాశమును జారవిడుచుకోలేక సద్వినియోగపరచు నుద్దేశ్యముతో, ఏదో ఆసందోహమ్ములో మాత్రకాల పరిష్వంగములతో క్షణికతృప్తి నందుచుండిరి. ఇది యేమా అని యడిగిన. మహాపౌరుష పేతుడగు వీరభద్రుని సృష్టించిన పరమశివుడే పత్నీ వియోగము భరించలేక, ద్వితీయను గావించుకుని, అంతటితో ఆగక తనదేహముననే అమర్చుకుని, తృప్తినొందక, తృష్ణ తీరక, గంగమ్మవంటి యితరస్త్రీలకై అర్రులుచాచగా, లేనిది కోర్కెల సంకోహమ్మున దారిగానని మాలాంటి సామాన్య

మానవులఎడనా అదిదోషము - అనూయకులఎడనా అది ధర్మము అనుచుండిరి.

ఈనాటి వారివలెగాక ఆనాటి స్త్రీలు వినయమే సహజభూషణముగా, ప్రాచీన సాంప్రదాయములను, యాచారములనూ నిల్పుచూ, గగనమున ఉదయభానునివలె ఫాలమున కుంకుమ రేఖలుదిద్దుకొని శిరీష కుసుమ పేశల శరీర నవయౌవ్వన సౌందర్యసౌభాగ్య మితరుల కంటబడనీక, జాతీయ జనతాప్రేరిత వస్త్రాలంకృతులై, అర్ధాంగుని శిరమునుండి జారిన నాగమువలె జాల్వారినజడలపై ప్రకృతిపంట పూచెండ్ల వలయాకారముగా నిడికొని, కేవల కుటుంబరక్షణ, మానవ సేవాకాముకులై భక్తిప్రేరితులై భగవానుని సాన్నిధ్యమునకు బయల్వెడలు స్త్రీలుకూ గానవచ్చుచుండిరి.

జంగములు శంఖనాదములు గావించుచుండ, బ్రాహ్మణోత్తముల వేదఘోషల నడుమ, దేవదాసీల ఘలుఘల్లు నాట్యాలతో ఆ దేవాలయప్రాంగణము అత్యంత శోభాయమానముగా వెలుగొందుచున్నది.

---

23

# 2

అట్టి ఆనందోత్సాహ వైశాఖ మాసమున పూర్ణిమ వెడలిపోయిన పది దినములకు —

శ్రీ భ్రమరాంబా మల్లేశ్వర దేవాలయ ప్రాంగణ మతికోలాహలముగా యున్నది అతి విశాలమైన ఆలయ పూర్వభాగ గోపురద్వారమునుండి, ప్రజ తండోపతండము లుగా లోనికి వచ్చుట గాంచిన లింగరూపధారియగు పరమ శివుడుసాక్షాత్కరించి, తాండవనృత్యము ప్రదర్శించుచుండెనా యనునట్లు లోనికి పోవువారేగాని వెలికివచ్చు వారెవ్వరూ కానరారైరి. అత్యాతురతతో, మూర్తీభవించిన కుతూహల ముతో, ఏతెంచిన ప్రతివ్యక్తియూ ఆజనసామూహికమునన యొకరగుచుండిరి — ఆనందోత్సాహమూ, యనుటకు వీలు లేదు. కేవలభీతహరిణలవోలె దృక్కులు బరపుచూ, భయ విహ్వలులై వారుండిరి. వారివదనములయందు వ్యక్తముకాని ఆకాంక్ష ఏదో ఆతురత స్పష్టముగా కన్పట్టుచున్నవి.

మధ్యందిన భానుడు తన సహస్ర కిరణములతో అగ్నిని కురిపింప చేయుచుండెనా యనునట్లు మానవ రక్తనాళ ముల నుడికింప చేయుచుండ, భయంకర పొగలసెగలతో సముద్రునినుండి యుత్పన్నమైన యావిరి మేఘరూపమున ఎటులవర్షించునో, మానవశరీరసంద్రమునుండి స్వేదము బిందు

వ్రలవలెమారి, వారివారి దుకూలములదడపు నుండెను. వాయువు కోపించెనాయన ఒక్కాకైననూ అల్లాడుటలేదు. ఆకులందున అణగిమణగియున్న పక్షులుసైతము బయటకు రానిరాకరించి, ఆకసమును వెలివేసెనా యన్నట్లు, వేడివెలుగు చెప్పెనా యని తోచుచుండెను – అతన్యుపై ఆగ్రహావేశుడైన పరమ శివుని మూడవనేత్రమట్లు నాటి భాను ప్రకాశమొప్పు చుండెను.

చక్కని సువిశాల రాజమార్గములగుండా, ఎండవేడిమికి పాదములు మాడుచున్ననూ బొబ్బలెక్కుచున్ననూ, నాలుక లెండుచున్ననూ, సరకుసేయక, భరించరాని యావేదన మూర్తీభవించిన యా వృద్ధమాతను, పసుపుబట్టల నడుమ యొవ్వనాన్ని, సంప్రాప్తించిన వైధవ్యాన్ని దాచ యత్నించే ఆయువతిని, ఆకస్మికమరణమునకు గురిఅయిన ఆ యువకుని గాంచుటకు, ప్రజ సమ్మగ్నముగా నచటగూడి యుండిరి. యింతలో అర్చకుడు కారణమరయ బయట కరుదెంచెను.

గుండబొజ్జయు, నొకపాటి గుజ్జురూపు — పసిమి చ్ఛాయ—అతని ముఖాన బ్రహ్మతేజము వెల్లివిరుస్తున్నది. బిళ్ళగోచికట్టు, విభూతినిచూడ, యపరశివావతారమా యన్పించుచుండెను. విషయమరసి లోనికి చనినాడు.

యాతడు గర్భగుడి ప్రవేశించినాడు "ఈశ్వరా, సర్వేశా కాపాడుము – ఆర్తత్రాణపరాయణా కాపాడుము" పంచాక్షరీ జపనిత్య నియక్తుడై . యాతని గళము నేడేలకో

పూడికొనినది. వందేశంభు ముమాపతిం ... అని ప్రార్థించినాడు.

"లోకక్షేమముకోరి నైజగుణముల్ చూపించ స్వార్థమ్ముతో
నీకే హాని యొనర్చెనంచు అతనిన్ నిర్మూలనమ్మొనర్చ సదా
ఆ కామాఖ్యుని బారినుండు, నరులన్ న్యాయంబుగా జూచితే

పాకారి ప్రముఖాది వందిత శివా ప్రాముఖ్యమాధర్మముల్॥

సర్వ దయామయుడూ, జీవబాంధవుడూనగు భాను మహాశయుని వేడిమిని ఓపలేక రోదించు భూమాతవలె ఆ విషాద గీతికల నడుమ ఆ వృద్ధ మాత ఎలుగెత్తి గద్గదులన పడుచుండెను.

"తనువున్ బాసినచోట కూలవడి భర్తన్ గూర్చి శ్రీశంకరా
ధన దోర్వీసఖ, చంద్రశేఖర కృపాధారేయ గౌరీశ్వరా
ఘనినారాయణుకోడలేద్వాగ రతీయాగ్రహింపు సత్రాపార్థనల్
విని ప్రాణమ్ముల నిచ్చినాడవుగదా విశ్వేశ శంభో ప్రభో॥

"సుతునిన్ చంపితి వేమికర్మమిది ఈ శోకమ్ము నార్పంగ నే
రితరమ్మాన్నె, సురేంద్రనాథ శివ, సర్వేశా, మహాదేవ నే
బ్రతుకన్ జాలనటంచు ప్రార్థనల్ సల్పన్ గౌరి, లంబోదరున్
బ్రతికించగను లేదె దేవగణముల్ భద్రంబు గానుంచగన్॥

అర్చకుని కంఠము దుఃఖమిశ్రితమయినది. శ్రావ్యము తగ్గి కంఠము పూడికొనిపోయినట్లున్నది. ఆ ప్రార్థనా గీతము

లన్నియు విషాదాలాపనవలెయుండి, వృద్ధమాతకు సానుభూతి తెల్పుచున్న ప్రజకు మరింత విషాదాన్ని ప్రసాదించి, మరింత మరింతగా క్రుంగదీస్తున్నవి. అందరూ మౌనముగానిల్చుండి తదేకధ్యానమున భగవంతుని ప్రార్థించుచుండిరి.

అందుకొక కారణముకలదు. ఆ మరణించిన యువకుడు దేవాలయమున రాజానుమతిన వివాహము గావించుకున్న వ్యక్తియే – అయిననూ ఈ మరణమెట్లు సంభవించెనా యను అనుమానము ప్రతి వారిని పీడించుచున్నది.

యింతలో యొకానొక వ్యక్తి అచటకు వచ్చిచేరెను. అతని వేషము, కట్టుతీరులు ఈ ప్రాంతీయుడు కాడని తెల్పుచున్ననూ భాషాసభ్యత ననుసరించి యాతడు తెలుగువాని వలెనే యున్నాడు. అతని వదనం వార్ధక్యంవలన ముడుచుకుని పోయియున్నది. ఆతని గాంచిన, తమ ముదుసలితనమున గూడా తెలుగులు కార్యనిర్వహణాభారమునకు వెనుదీయరని తేటతెల్లమగును. అందుకుసాక్షి యాతడే.

27

# 3

ఆతడు మహోన్నతాంధ్ర సామ్రాజ్య మహామంత్రి మహారాజ మాధవవర్మల కాంతరంగికుడు. శివశర్మ యాతని నామధేయము, గౌతమగోత్రీకుడు. మాధవవర్మ మహారాజుని తల్లి సిరియాళదేవిని, రక్షించి, తనకూతురని బాహ్యాలోకమునకు చాటి మాధవవర్మకు విద్యాబుద్ధులుగరిపిన విష్ణుభట్ట సోమయాజియగు మాధవశర్మ తమ్ముడు అగ్నిశర్మ కుమారుడీతడు. మాధవవర్మ తండ్రి సోమదేవరాజు, యాతని మంత్రి అగ్నిశర్మ.

కందారదుర్గము గోదావరీనదీ తీరముననున్నది. దానికి సోమదేవరాజు ప్రభువు. తూర్పు పడమటి సముద్రములు మొదలు హైదరాబాదువఱకు నతని రాజ్యము విస్తరించెను. అతడు చంద్రవంశపురాజు. పౌరుషవంతుడు. నీతిపరుడు. అతడు ప్రజారంజకముగా రాజ్యమేలుచుండెను.

సోమదేవరాజుభార్య సిరియాళదేవి. ఆమె లోకాతీత సౌందర్యవతి. గుణవతి. ఆదంపతులు పార్వతీ పరమేశ్వరులవలె లక్ష్మీనారాయణులవలె, శచీపురందరులవలె ప్రకాశించుచుండిరి. ప్రజలు సోమరాజును దైవముగా పూజింతురు. ఆరాజదంపతులకు సంతతి లేకపోవుటచే పశుసంతతినే బిడ్డలవలె చూచుచుండిరి. వారికున్న గోసంపద అత్యధికము.

అనావృష్టి దోషమువలన పచ్చిక తన దేశమున లేక పోవుటచే పరిసర గ్రామములకు గోవులను పశులకాపరులు తోలుకొని పోయెడివారు. సోమరాజు సద్గుణములయెడ ఈర్ష్యాపరులై కొందఱురాజులు కటకాధీశ్వరుని పక్షము వహించిరి. కల్యాణకటకము కందారదుర్గపు పొలిమేరగలదు. కటకాధిపుడగు బల్లహుఁడు చాళుక్యవంశజుడు. సోమరాజు బల్లహునాశ్రయించిన సామంతరాజులను కొందఱను చేరదీసెను. విరోధి దండెత్తి వచ్చినచో తగినశాస్తి చేయవచ్చునని యాతడాలోచించెను.

బల్లహుఁడు కయ్యమునకు కాలుద్రువ్వ నిశ్చయించి సోమరాజుకొక జాబును వ్రాసిపంపెను. వాని గోవులు తమ బీళ్లలోపడి చెడమేసినవనియు. గొల్లలనదలించినను వారుబెదరకుండిరనియు, తన యాజ్ఞలేనిదే యాక్లోనర్చుట తప్పనియు, చట్టము ప్రకారము పుల్లరి చెల్లించి క్షమాపణ చెప్పుకొని పశువులను, పశువుల కాపరులను విడిపించుకొని పొండనియు, లేదా మరి యేయితర మార్గముచేతనైననుసరే విడిపించుకొనుడనియు వ్రాసిపంపెను.

సోమరాజా యుత్తరము చూచి మండిపడి గోవులనే కాదు, పశుపాలకులనేకాదు, మీపాలకునిసైతము కొనిరాగలమని చెప్పుడని వార్తాహరునకు చెప్పిపంపెను. యుద్ధమునకు సిద్ధముగానుండుడని తనవారి కాజ్ఞాపించెను. తన రాజ్యమును కీర్తివర్మ యను మంత్రికప్పగించి సోమరాజు యుద్ధప్రయత్నములలో నుండెను. కటకాధీశుడును సామంతుల సహాయ

మపేక్షించెను. సోమరాజు సామంతులు కొందరు కటకమునకు వచ్చిచేరిరి.

కందారరాజ్య సైన్యములు కాల్యాణకటక దుర్గమును ముట్టడించినవి. రెండుపక్షముల వారికి భయంకర యుద్ధము జరుగుచుండెను. కోటతలుపులు బ్రద్దలుకొట్టుటకు సోమరాజు ప్రయత్నించెను. కాని సాధ్యము కాకపోయెను. కోటబురుజులపై నుండి బల్లహుని సైనికులు శత్రువులపై బాణవర్షము కురిపించుచుండిరి. రెండువారము లెడ తెగక యుద్ధముజరిగెను సోమరాజు తెచ్చిన యాహారపదార్థము లైపోయినవి. తన పక్షమున యుద్ధముచేయుచున్న సామంతులు కొందరు తటాలున కటకేశ్వరుని పక్షము వహించిరి. సోమరాజతి సాహసమున తన సైనికులతోకూడి కోట తలుపులు బ్రద్దలుకొట్టెను. కాని జయముమాత్రము కలలోని వార్త యయ్యెను. అంత మహావీరుడు గత్యంతరము లేక సైనికులతో తన రాజధానికి పారిపోయెను.

బల్లహుడు సామంతులను సైనికులను అభినందించి కొలది కాలములో కందారదుర్గమును ముట్టడింపవలెనని నిశ్చయించెను. సోమరాజు తన పరాజయమునకు మిక్కిలి విచారించినాడు. ఇష్టుడు వానికి మహావ్యాధిపట్టుకొనెను తండ్రిఋణము తీర్పగల కుమారుడు లేకుండుటకు మిక్కిలి విచారించెను భూసురులతో సంప్రతించెను. పుత్రకామేష్టి చేసినచో తప్పక మహావీరుడగు పుత్రుడు పుట్టునని భూసురులాశీర్వదించిరి. నగరమంతయు శీఘ్రముగా నలంకరించిరి. మహావైభవముగా యజ్ఞము

జరిగెను. యజ్ఞఫలితముగా సిరియాళదేవి గర్భముధరించినది. అక్కడ బల్లహుడు యుద్ధప్రయత్నములు సంపూర్ణముగాచేసి సోమరాజింకను పూజాదికములందే నిమగ్నుడై యున్నాడని తెలిసికొని ఆకస్మికముగా నగరమును ముట్టడింప ప్రియత్నించెను. కందారసైన్యములుసిద్ధముగాలేవు. ఆకస్మికపు ముట్టడికి నగరమంతయు నల్లకల్లోలమైనది కందారసైనికులనుశత్రువులు చిత్రవధ చేయుచుండిరి. జయమందాశ లేశమును లేకపోవుట చే సోమరాజంతఃపురములోనికిపోయిభార్య చేయిపట్టుకొనియామె గర్భమునమహావీరుడగు పుత్రుడున్నాడనియు. వానినికాపాడుకొనుట ఆమె విధియనియు ప్రోత్సహించి ప్రాణరక్షణచేసికొమ్మని యాజ్ఞాపించినాడు. పతితో సహగమనముచేయనిశ్చయించుకొన్న యాసతి పతిమాట జవదాటక భటుల సాహాయ్యమున కోటనుండి వెడలిపోయినది.

శత్రుసైనికులు విజృంభించి నగరమంతయు నాశనము చేసిరి. సోమరాజు హతుడయ్యెను. కటకాధీశ్వరుడు విజయపతాక నెత్తించి తనపురికేగెను.

సిరియాళదేవి విశ్వాసపాత్రులగు నిరువురు సేవకులను వెంటనిడుకొని చోడిత్రోవంబట్టి పోయి దుర్గమారణ్యములందు ప్రవేశించెను. ఎచ్చటికి పోవలయునో యెట్లుపోవలయునో యామెకేమియు గోచరించలేదు. సేవకులెట్లో యామె నా యరణ్యములనుండి హనుమకొండవైపునకు తీసికొని పోయిరి.

హనుమకొండ (వగంగల్లు) కెటుకురాజు పరిపాలకుడు.

అతడు ప్రతాపశాలి. కాని యీరాజ్య మిప్పుడు బల్లహుడు జయించిన కందారరాజ్యములో చేరినది. ఇప్పుడతడు కట కేశ్వరునకు సామంతుడు. సేవకులెఱుకరాజునకు సమాచార మంతయుచెప్పి సిరియాళదేవిని రక్షింపుమని కోరిరి. కాని యీవృత్తాంతము కటకాధిపతికి తెలిసినచో తనకును, సిరి యాళదేవికినికూడ నపాయము వచ్చునని భయపడి వేఱు చోటికి తీసికొని పొమ్మనెను. ఆగర్భశ్రీమంతురాలు, అం దును గర్భవతి, కాలుతీసి కాలుపెట్ట లేనిస్థితిలోనున్నది. ఎట్లైన కాపాడుడని సేవకులెంత బ్రతిమాలినను క్రూరుడగు బల్లహునకు భయపడుటచే నతడంగీకరింపలేదు. ఇంక గత్యం తరములేక వారక్కడనుండి వెడలిపోవుచు వారి సమాచార మేమియు కటకాధీశునకు చెప్పవలదనియు, అంతమాత్రముప కారమైన చేయుడనియు కోరిరి. ఎఱుకురా జందుల కొడం బడెను.

భరింపరాని కష్టములతో వారు ముప్వురు దుర్గమార ణ్యములో ప్రయాణము చేయుచుండిరి. వెళ్ళగా వెళ్ళగా కను చూపుమేరలో వారికి జనులున్న తావగపడెను. అల్లంత దూరములో నొక దేవాలయ సమీపములో నొక యగ్రహా రము గలదు. అందన్నియు బ్రాహ్మణ గృహములే. అదియు నెఱుకురాజు పాలనలోనిదే. ఆయగ్రహారమునకు నాయకుడు మాధవశర్మ. అతడు మహా పండితుడు. వానిమాట నెవ్వరు జవదాటరు.

రాజసేవకులు సిరియాళదేవి నట్లో తీసికొని పోయి

మాధవశర్మకు వృత్తాంతమంతయు నివేదించి యాతని యాశ్రయమును గోరెను. ఉదారుడు,దయామయుడునగు మాధవశర్మ హృదయము కరిగెను. కాని సభచేసి ప్రజల యందరి యనుమతి పొందవలెనని యెంచి యతడు బ్రాహ్మణుల నందరిని రప్పించి సభలో తన యభిప్రాయమెఱిగించెను. అందొక బ్రాహ్మణుడు బల్లహునివలన నేమి హాని కలుగునోయను భయమును సూచించెను. కాని మాధవశర్మ వీర రసపూరితములగు మాటలుపల్కి, యబలను, అసహాయను కాపాడుట తమ కర్తవ్యమనియు, నందును నిండుచూలాలిని రక్షింపక విడుచుట మహాపాపమనియు నెన్నియాపదలైనన నెదుర్కొని రక్షింపవలెననియు బోధించెను. బ్రాహ్మణులందరేకీభవించినారు. హరిహరాదులడ్డు వచ్చినను ఆమెను రక్షింప సమకట్టిరి.

మాధవశర్మకు పార్వతి యను కుమార్తె గలదనియు సిరియాళదేవియే పార్వతియనియు నామె యిప్పుడు పుట్టింటికి పురిటికై వచ్చినదనియు వ్యవహరించుచుండిరి. మాధవశర్మ రాణిని తనకన్న కుమార్తెగా చూచుకొనుచుండెను. ఆనాడు వాల్మీకి సీతను రక్షించినట్లు మాధవశర్మ సిరియాలదేవిని కాపాడినాడు. కాని యామె కష్టములింకను గట్టెక్కలేదు.

బల్లహుడు కందారదుర్గమును స్వాధీన పరచుకొని, భోమరాజును చంపించెను. జ్యోతిష్కులవలన సిరియాళదేవి గర్భముననున్న కుమారుడుతనకు మారుడగునని తెలిసికొని సిరియాళదేవికొఱకు కంతఃపురమంతయు వెదకించెను.

కాని యామె కనిపింపలేదు. పరిచారికలవలన నామెవృత్తాం తమును తెలిసికొన ప్రయత్నించెను. వారు చచ్చుటకైన సిద్ధపడిరి. కాని యామె వృత్తాంతమును చెప్పలేదు. దుర దృష్టవశమున రాణి చిత్రపటము నాయంతఃపురములో బల్లహుడు చూచెను. దానిమూలమున నామె జాడ తెలిసికొన నగునని బల్లహుడు సంతోషించి యా చిత్రఫలకమును గొంపో యెను. విశ్వాసపాత్రుడగు వానినొకనిని కందారదుర్గమునకు తన ప్రతినిధిగాచేసి బల్లహుడు నిజరాజధానికి వెళ్ళెను.

బల్లహుడు సభచేసి సిరియాలదేవి జాడ కనుగొనుట త్యావశ్యకమనియు, ఆమెకు పుట్టబోవు కుమారుడు తనకు మారుడగుననియు చెప్పి దండనాథుల నన్నిదిక్కులకు వెదుక పంపెను. సైన్యముతో తనొక దిక్కునకు బయలుదేరెను. బల్లహుడు సముచిత పరివారముతో హనుమకొండ మార్గమును పట్టినాడు. ఎఱుకురాజునకు వర్తమానమంపి సిరియాళదేవి చిత్రపటమును సైనికులకొసంగి యట్టి స్త్రీ యెందున్నదో వెదకిరమ్మని యాజ్ఞాపించెను. వారాయూరంతయు గాలించిరి కాని యామెజాడ కానరాలేదు.

కటకాధిపతి తిన్నగా అగ్రహారము చేరినాడు. అగ్రహారమందిల్లిల్లు వెదకించినాడు. సైనికులుపోయి వెదకి చిత్రపటమునందున్న స్త్రీ పోలికగల స్త్రీ, గర్భవతి, మాధవశర్మ యింటనున్నదని రాజుతో చెప్పిరి. సైనికులను చూచి యామె భయకంపిత యైనది. రాజభటులు నిర్దయులై యామెను బలవంతముగా నీడ్చుకొని పోవుచుండిరి. ధ్యాన

నిష్ఠలోనున్న మాధవశర్మ కామె దీనాలాపములు వినిపించి నవి. తటాలున నాతడు ధ్యానమునుండి లేచి రాజభటుల దురాగతమునుచూచి వారిని నిందించి యామె తన కుమార్తె పార్వతియనియు పురిటికై పుట్టింటికి వచ్చినదనియు, విడిచిపెట్టు డనియు గద్దించెను. వానిమాట పెడచెవిని బెట్టి బల్లహుని దగ్గరకు తీసికునిపోయిరి. అతడామెను తన పట్టణమునకు తీసికొనిపోయి యొక కారాగారమున బంధించెను.

మాధవశర్మ నాయకత్వమున అగ్రహారము లోని బ్రాహ్మణులందరూ ప్రళయకాల రుద్రులవలె విజృంభించి బల్లహుని సభలో ప్రవేశించిరి. ప్రతిభాశాలియగు మాధవ శర్మ బల్లహుని సమీపించి యాబంధితురాలు తన కుమార్తె పార్వతియనియు, తన యింటికి పురిటికి వచ్చినదనియు, ప్రపంచమున మనుష్యుని బోలు మనుష్యులుండుట యసంభవము కాదనియు, తానట్టి దుర్మార్గమున కొడిగట్టిన తన రాజ్యము సర్వనాశనము కాగలదనియు, తమకడనున్న అమోఘాయుధము సత్యాగ్రహము ప్రయోగించి కుమార్తెను విడిపించుకొన సిద్ధముగానుంటిమనియు గంభీరముగా నుపన్యసించినాడు.

బల్లహుని మంత్రి యొక యుక్తిపన్ని "మాధవశర్మ గారూ! ఈమె సిరియాళదేవి కాదంటిరి. మీ కుమార్తెయే యైనచో మీరీమె చేతివంటకము భుజింపుడు. అప్పుడునమ్మెద' మనెను. రాజాయుక్తికి చాల సంతసించెను.

మాధవశర్మ యుక్తికి ప్రత్యుక్తి తెలియంగనివాడా? వెంటనే "నా కుమార్తె చేతివంటకము నేను భుజించుట

కెందుల కభ్యంతరము? కాని యింకొక ధర్మసూక్ష్మమున్నది. మీ యాస్థానపండితులనుకూడ నడిగి తెలిసికొనుడు. ఆమె నిండుచూలాలు. ఆమె ప్రసవించిన మూడు నెలలవఱకు ఆమె చేతివంటకము భుజింపరాదని ధర్మశాస్త్రము '' అనిచెప్పెను. మాధవశర్మ చెప్పినది శాస్త్రసమ్మతమే యని మహాపండితు లందరంగీకరించిరి. కాని వాని పరీక్షకు మరియొక మార్గ మున్నదని పల్కిరి. దేవియొక్క ఆలయమునందు సిరియాళదేవి చేతి నేయి, పాలు మాధవశర్మ గైకొన్నచో ఆమె వాని కుమార్తెయే యని నిర్ధరింపవచ్చునని పండితులు సూచించిరి. ధర్మాధర్మము లెఱింగిన మాధవశర్మ తక్కిన బ్రాహ్మణ సమూహముతో దేవి యాలయమున పంక్తులుతీరి కూర్చొని సిరియాళదేవి చేతి నేయి పాలు గ్రహించెను. సిరియాళదేవిని బల్లహుడు మాధవశర్మ కప్పగింపక తప్పనదికాదు. తానొన రించిన దుండగమునకు బల్లహుడు మాధవశర్మను క్షమాపణ వేడుకొనెను. రాణిని బంగారు పల్లకిలో కూర్చుండబెట్టి బ్రాహ్మణులందఱా పె నగ్రహారమునకుం గొంపోయిరి. ఈవిధ ముగా మాధవశర్మ రాణిని బంధవిముక్తురాలినిగా చేసెను.

సిరియాళదేవిని వెదకించు బాధ్యత యిప్పుడు బల్లహు నకధిక మయ్యెను. సేనానులు దేశ దేశములకు పోయి యామెను వెదుకనారంభించిరి. ఎచ్చటను కానరాలేదని తిరిగి వచ్చి వచించిరి. బల్లహుడు విసిగివేసారి చివరకు దీర్ఘాలోచన చేసి యామె ప్రాణత్యాగము చేసికొనియుండునని తలంచి యూరకుండెను.

సిరియాళదేవి యొక శుభముహూర్తమున ప్రసవించినది. మగశిశువు జన్మించినాడు అగ్రహారమంతయు నానందమున మునిగినది. మాధవశర్మ సంతోషాబ్ధికి మేరలేదు. సిరియాళదేవి కోరికప్రకారము రాజకుమారునకు మాధవవర్మ యని పేరు పెట్టిరి, కుమారుడు దినదినాభివృద్ధి నందినాడు. తల్లి మహావీరుల గాథలను, మంచి నీతులను బోధించెడిది. రాకుమారున కైదవయేడు వచ్చుసరికి అక్షరాభ్యాసముచేసిరి. అతడు కుశాగ్రబుద్ధి. సమస్త విద్యలను చక్కగా ఆకళించి నక్షత్రములలో చంద్రునివలె ప్రకాశించుచుండెను. వానికి పండ్రెండేండ్లు నిండినవి. మాధవశర్మ వానికి ఆయుధవిద్య కూడ బోధించినాడు.

అగ్రహారమున కుత్తరముగా నాలుమైళ్ళ దూరములో చంపారణ్యము గలదు. అందొక కోయగూడె మున్నది. అందలి కోయవాండ్రు విలువిద్యా ప్రవీణులు. చండసేనుడు కోయవాండ్రకు ప్రభువు. అతడు మహా పరాక్రమవంతుడు. నమ్మినవారికి ప్రాణమర్పించు సాహసుడు. కోయలందఱు వానియాజ్ఞ శిరసావహింతురు. చండసేనునకు మాధవశర్మకు ప్రాణస్నేహము. అతడప్పుడప్పు డగ్రహారములోనికి వచ్చి మాధవశర్మతో ముచ్చటించి వాని సలహానుపొంది పోవుచుండును. ఒకనాడు మాధవశర్మ తన మనుమడగు మాధవవర్మను చూపి వానికి విలువిద్య నేర్పుమని కోరెను. అతడు సంతోషముతో నంగీకరించి వానిని తనగూడెమునకు రాజుగా చేసికొందునని కూడ చెప్పెను.

బల్లహుడు కందారదుర్గము నాక్రమించుకొననే గాని యా ప్రజాసౌఖ్యములను చూడడయ్యెను. అతడు రాజ్యమదాంధతచే ప్రపంచమునే మఱచిపోయినాడు. సిరియాళదేవి వృత్తాంతము వానికి హృదయశల్యమయ్యెను. అప్పటికి పదాఱేండ్ల కాలమయ్యెను. సిరియాళదేవి బ్రతికియుండి ప్రసవించినచో పదాఱేండ్ల రాకుమారుడుండియుండ నలయుననియు, తనకుమార్తె చంపకమాలినికి పెండ్లియీడు వచ్చుటచే నామెకు స్వయంవరము ప్రకటించినచో నాకుమారుడు స్వయంవరమునకు రాగలడనియు నప్పుడు కర్తవ్యమూహింపవచ్చుననియు తలంచెను. యుక్తిపన్న నెంచెను.

బల్లహునకు పుత్రసంతతి లేదు. చంపకమాలిని యను కుమార్తె యొక్కతియే. ఆమె గుణవతి, సౌందర్యవతి, విద్యావతి. ఆమె యిష్టానుసారమే పెండ్లిచేయ సంకల్పించి బల్లహుడొకనాడామెను దగ్గరకు చేరదీసి స్వయంవర ప్రకటన విషయమును ప్రస్తావించినాడు. ఇప్పుడు స్వయంవరమున కేమితొందరయని చంపకమాలిని తండ్రికి జవాబిచ్చినది. ఆ పలుకులతో వాని యాశాలత తెగిపోయినది. బల్లహుడా మందిరమువీడి తన శయనగృహమును చేరినాడు.

మాధవవర్మ విలువిద్యయం దసమాన పాండిత్యము సంపాదించెను. కోయవాండ్రకు నాయకుడయ్యెను. చండసేనుడు మాధవవర్మను తీసికొనివచ్చి మాధవశర్మ కప్పగించినాడు రాజకుమారుని పరదేవతాకరుణకు పాత్రునిగా చేయవలెనని మాధవశర్మ సంకల్పించినాడు. ఒక శుభదినమున

దేవీమంత్రము నుపదేశించినాడు అగ్రహారమున కాగ్నేయ దిశనున్న చింతతోటలో భవాని ఆలయముగలదు. దసరా దినములలో మాధవశర్మ దేవీనవరాత్రములు మహావైభవముగా జరిపించును. ఆ తొమ్మిది రోజులు మాధవవర్మ తాత సమీపముననే యుండెడివాడు. విజయదశమి ప్రాశస్త్యమును తాత మనుమనికి బోధించెడివాడు.

తాత ఆజ్ఞప్రకారము మాధవవర్మ దేవి నుపాసించినాడు. దేవి వాని భక్తినిశ్చలతకు మెచ్చి, వాని పూర్వవృత్తాంతము, వాని తలిదండ్రులు పడుచున్న యవస్థలు, బల్లహుని దురంతములు పూసగ్రుచ్చినట్లు చెప్పి యమ్మరణ్యమునకు సమీపమున నొకగుట్ట కలదనియు, దానిదగ్గర నొకరాతిపలక యున్నదనియు, తనను స్మరించుకొని యారాతిపలక ముట్టుకొనినచో అచట యొక బిలమగుపడుననియు, దానిసారంగముగుండ పోయినచో అక్కడ వివిధాయుధములు, రత్నరాసులు కనపడుననియు, ఆయాయుధములలో అజేయమను ఖడ్గమున్నదనియు దానితో నఖండజయ మందగలవనియు, కళ్యాణదుర్గమును ముట్టడించి, దుర్మార్గుడగు బల్లహుని చంపి, సుఖముందుమనియు పలికి యదృశ్యురాలయ్యెను.

మాధవవర్మ పరమానందభరితుడై దేవిని మనసార ధ్యానించి యింటికివచ్చి తాతకు నమస్కరించి యంతయు విన్నవించెను. తాత యాజ్ఞానుసారము మాధవవర్మ కోయగూడెమునకుపోయి యిరువురు మిత్రులను వెంట బెట్టుకొని దేవిచెప్పిన చోటికిపోయి, యా బిలమునజొచ్చి ఆయుధము

లను, ధనరాసులను అజేయమను ఖడ్గమును తీసికొని యగ్ర హారమునకు తిరిగివచ్చి యన్నియు గురుదేవున కర్పించినాడు

"ఎనయగ దుర్గయిచ్చె ధనమిద్ధనంజయ భీకరాం కుకున్, మనుజ వరేణ్యతం బరగు మాధవవర్మకు గౌర వంబునకున్॥"

మాధవవర్మ దేవీప్రసాదియనియు, పరాక్రమనిధియ నియు చుట్టుప్రక్కల వ్యాపించినది. సిరియాళదేవి రక్షణను తిరస్కరించిన యెఱుకు రాజునకీసంగతి తెలిసినది. అతడు ముసలివాడైనాడు. వానికి సంతానములేదు. తనపై మాధవ వర్మ దండెత్తునని తలంచినాడు. తనగౌరవము కాపాడుకొన నెంచి తన సమస్త సైన్యముతో మాధవశర్మ యింటికివచ్చి ముత్యాలహారముతో రాజకుమారు నలంకరించి తన రాజ్య మును స్వీకరింపుమని కోరినాడు. మాధవశర్మ యానతినను సరించి మాధవవర్మ యెఱుకురాజు కోరికను మన్నించెను. హనుమకొండ రాజ్యాధినేతయై నాడప్పుడే మాధవవర్మ. బల్లహుని గర్వాపహరణ నాటకమునకు నాందీప్రస్తావనలు జరిగినవి. మాధవవర్మ ప్రధాన నాయకుడును, మాధవశర్మ సూత్రధారియునైరి. భర్తచేసిన యుపదేశమును జ్ఞప్తికితెచ్చు కొని సిరియాళదేవి భర్తృఆత్మశాంతికై దేవిని నిరంతర మారాధించుచుండెను.

సిరియాళదేవితో వచ్చిన యిరువురు సేవకులు కం దారదుర్గమునకు గూఢచారులుగా పంప నిశ్చయింపబడిరి. వారు బిచ్చగాండ్ర వేషమునపోయి తమకు పరిచయులు

విశ్వాసపాత్రులగు వారితో సిరియాళదేవి యొక్కయు నామె కుమారునియొక్కయు వృత్తాంతములను సాంతముగా చెప్పి సమయము వచ్చినప్పుడు రాకుమారునకు సహాయము చేయు డని ప్రోత్సహించినారు. అందఱు సంతోషించి దురాత్ము డగు బల్లహుని పరిపాలనమంత మొందింపవలయునని తలంచు చుండిరి. వేగులు తిరిగి యగ్రహారమువచ్చి కందార ప్రజల యభిప్రాయములను చెప్పిరి. కందారప్రజలు తిరుగుబాటు చేయనున్నారని ప్రతినిధి బల్లహునకు తెలియచేసెను. ఆసమ యముననే మాధవవర్మ "యుద్ధమునకు సిద్ధముకమ్ము లేదా ఓడిపోతినని యొప్పుకొని రెండురాజ్యములు నాస్వాధీనము చేయుము. ఒకవారము గడువిచ్చితిని" అని పంపిన సందేశము చేరెను. బల్లహుడా సందేశమందుకొని యుగ్రుడైనాడు. కొలువుతీర్చి సామంతామాత్యుల నందఱను సమావేశ పఱచి నాడు. మంత్రులు. సామంతులు వీరాలాపములాడినారు. బల్లహుడు యుద్ధముచేయుటకే నిశ్చయించుకొనినాడు.

మాధవవర్మ యుద్ధయాత్ర నారంభించినాడు. చండ సేనుని నాయకత్వమున కోయవాండ్రందఱు ఆయుధపాణులై వచ్చిరి. ఎఱుకురాజు సైన్యములువచ్చిచేరినవి. కొన్ని కందార సైన్యములు రహస్యముగావచ్చి కోయదండులో చేరినవి. ఇదంతయువిని బల్లహు డాశ్చర్యపడినాడు. వెనుకకు తిరిగిపో వుట కంగీకరింపక యుద్ధమునకు తలపడినాడు. పోరు ఘోర మయ్యెను. బల్లహునకు సహాయముగా వచ్చిన సైన్యములు పాఱిపోవుచుండెను.—

బల్లహుడు స్వయముగా కత్తిపట్టి యుద్ధరంగమున కురికెను, మాధవవర్మ దేవినితలచి, గురునకు నమస్కరించి, అజేయ కరవాలము ధరించి బల్లహు నెదుర్కొనెను. ఆ యుద్ధము కర్ణార్జునుల ద్వంద్వ యుద్ధమువలె నున్నది. మాధవవర్మ నిశిత కరవాల ఘాతమున బల్లహుడు నేలం గూలెను. ఇంతలో మాధవశర్మ బల్లహుని సమీపించెను. బల్లహుడు వానినిచూచి నిందింప దొడగెను. ఆనిందా వాక్యములను సహించలేక మాధవవర్మ తన అజేయఖడ్గమును బల్లహుని హృదయమున గ్రుచ్చెను. బల్లహునకిక ప్రాణములపై నాశలేదు. "రాకుమారా! నా యేకైకపుత్రిక చంపకమాలిని ఆమెను పెండ్లియాడి సుఖింపుము. ఇది నా తుదికోరిక" యని బల్లహుడు మాధవవర్మను వేడుకొనెను. మాధవవర్మ గురుదేవునివైపు చూచెను. రాజ్యలక్ష్మి కరగ్రహణముతో కన్యాపాణిగ్రహణ మాచరించుట శుభావహమనియు వాని తుది కోరిక చెల్లించుట ధర్మమనియు మాధవశర్మ సూచించెను. అత డంగీకరించెను. బల్లహుడు మరణించెను.

రక్తముతో తసిడిన శరీరముతోనే మాధవవర్మ పట్టాభిషిక్తుడయ్యెను.

చంపకమాలినీ మాధవవర్మల వివాహ మొక శుభముహూర్తమున మహా వైభవముగా జరిగిపోయెను. గుర్వాజ్ఞ ప్రకారం మానాడే మాధవవర్మ కందారరాజ్య సింహాసన మధిష్ఠించెను.

అపుడే, మాధవశర్మకు పాలమూరు గ్రామమును దానమిచ్చి యుండెను. అందుచే మాధవశర్మ వంశీయు లందరూ పూర్వాగ్రహారీకులని పేరునందినారు. పాలమూరు శాసనము ప్రకారము శివశర్మయూ పూర్వాగ్రహారీకుడే - ఈతనికే గోవిందశర్మయను నామాంతరము కలదని కొందరు పండితుల వాదన.

---

# 4

శివశర్మ వదనాన అవక్తానందం గోచరిస్తోంది. అతనితీ వలనే సరిహద్దు ప్రాంతాలనున్న రాష్ట్రకూటుల చిలిపి దండ యాత్రల నరికట్టుటకై వెళ్ళియుండెను. తన కార్యనిర్వాహణ జయప్రద మొనరించుకుని మరుదినము జరుగనున్న యువ రాజు విక్రమహేంద్రవర్మల పట్టాభిషేకానందోత్సవమున పాలు పుచ్చుకొనుటకై చారదళము కంటె ముందుగనే వచ్చినాడు.

కృష్ణానదిని దాటి స్నానమాచరించి, భ్రమరాంబ మల్లేశ్వరుల నారాధించుటకై దేవాలయ ప్రాంగణమున యడుగిడినాడు. ఆ జన సమూహాన్ని చూసేసరికి ఆశ్చర్య పడి నాడు. ముందుకు కదలిపోవుదమన్న, జనము నొత్తిగిల చేయ శక్తి చాలదు. అతను మారువేషమున నుండుటచే తమ ప్రియతమ మహామంత్రిగా యెవరునూ అతనిని గుర్తించ లేకపోయిరి,

కారణమేమా యని యెందరినో ప్రశ్నించెను కాని ఒక్కరునూ అతనికి సమాధానమివ్వక, వడివడిగా వెడలి పోవుచుండిరి. వెనుదిరిగి పోవుదమనుకున్నాడు – కాని యాతని మనమెందులకో యిచ్ఛగింపలేదు. ఇంతలో ఆ జన సమూ హామునుండి యొక వ్యక్తి "పాపం" అని నిట్టూర్చుచూ

బయటకు వచ్చినాడు. వృద్ధుడు యాతని గమనించి -
"ఈ ప్రజ యింత విషాదముగా యుండుటకుగల కారణ మేమో నేనరయ వచ్చునా" యని ప్రశ్నించినాడు.
ఆ వచ్చిన వ్యక్తి మౌనముగా యుండిపోయినాడు —
"రేపటిదినం యువరాజు విక్రమహేంద్ర వర్మల పట్టాభిషేక మని వాడ వాడలా ప్రకటించియున్నారుకదా —
"అవును"— అన్నాడావ్యక్తి.
"అట్లయిన ఆనందోత్సాహాలతో వుండవలసిన ప్రజ యింత విషాదంగా యున్నారే — కారణము తెలియ నా మనమువ్విళ్ళూరుచున్నది. ఆ వ్యక్తి వృద్ధుని ఎగా దిగా పరిశీలించెను కాని, మహామంత్రిగా గుర్తించలేకపోయెను.

"మీరీ ప్రాంతీయులుకారా? —
"కేవల యాత్రార్థమై యీ ప్రాంతమున కరుదెంచియుంటిని ఇంద్ర కీలాద్రి పర్వతముపై వేంచేసియున్న దుర్గాదేవి దర్శనార్థము యిచటికిరాగా, దేవాలయము కిక్కిరిసి యున్నది. మహారాజా మాధవవర్మలు అపర ధర్మావతారులని విని యుంటిని —

"యదార్థము" —
"రేపు పట్టాభిషేకముకదా" —
"అవును" —
"యువరాజు పాలన యిష్టతలేకనా" —

" యువరాజులు తండ్రిని మించిన ధర్మ స్వరూపులు "

" మరి ? —

వృద్ధమంత్రి హృదయం ఆనందంతో వుప్పొంగి పోయింది. అయిననూ, ఆ దేవాలయాచార మొకటి యితనికి కుశ్శంక కల్గించుచున్నది. అది ఏమన, ప్రత్యేక కారణములు లేక దేవాలయమున ఆత్మశాంతి ప్రార్థనలు జరుగవు.

" క్రొత్త గుర్రములు అలంకరింపబడిన రథముపై యువరాజులు పుర వాహ్యాళి బయలుదేరినారు —

" అయిన "—

" ఇంకేం చెప్పమంటారు, గుండెలు అవిసిపోతోంటే "—

యువరాజునకు ఈ జన సమూహమునకు గల సంబంధమేమాయని యాతని హృదయంలో సందేహం బయలు దేరింది.

" చెప్పు నాయనా —

" ఆ గుర్రాలు బెదరి, ఒక వృద్ధురాలి కొడుకును పొట్టబెట్టుకున్నాయి" వృద్ధుడు చలించిపోయాడు — నెమ్మదిగా జీర వోయిన గొంతుతో " ఎలా సంభవం అయింది " అని ప్రశ్నించినాడు.

" అవి పాంచాల దేశపు గుర్రాలట—

" సారథి ఎవరు —

" లేడు " —

"లేదా—" అని ఆశ్చర్యం, విషాదం పూడుకున్న కంఠంతో ప్రశ్నించాడు.

"నూతనోత్సాహం యౌవ్వనపుపొంగు మీకు తెలియనివా - వారే స్వయంగా సారధ్యం చేసికొంటూ బయలు దేరారు. విపణివీధి సమీపాన, ఆ అభాగ్యుడు రథముక్రిందబడి మరణించినాడు—యాతని ముదుసలి తల్లియూ, పసుపు బట్టలు విడువని భార్యయూ న్యాయగంట ప్రమోగించి - ఆత్మశాంతి ప్రార్థనలకై యిచటకు ఆ యువకుని మృతశరీరమును గొని వచ్చినారు. మహారాజులు ధర్మపక్షమున పుత్రునేకాదు-ఎవరినైననూశిక్షించు స్వభావము, కలవారని యందరికీ తెలియును. అందువల్లనే ప్రజలు యింత విషాదముగా యున్నారు" అంటూ ఆ యువకుడు నిట్టూర్చాడు.

ఇంతలో ఆ సమూహాన్నుండి "యిప్పుడు తెలియాలి, మాధవ వర్మల ధర్మనిరతి" అంటూ బయటకువచ్చాడొక అవాకుల చవాకుల శాశ్వత ప్రతినిధి.

"అంతేకాదు. మేమే ఘనులమని విర్రవీగే ఆంధ్ర ప్రశస్తి కూడా యీనాటితో తేలిపోతుంది-అన్నాడొక పరదేశీయుడు "అట్లనుటకు వీలులేదు"— అన్నాడొక కాందిశీకుడు.

"మాధవవర్మలు ధర్మమూర్తులని యొకరు, నీతి, నిజాయితీలకు ప్రతిబింబమని మరియొకరు, తలకొకవిధముగా మాట్లాడుకొనుచుండిరి.

ఇక యీ మాటలేమియూ వృద్ధుని మానసాన్ని చేర లేకపోయాయి. ఈ చావుకు కారకుడు యువరాజని తెలియుటతోడనే యాతని మనము కృంగిపోయినది. హత్యకు ప్రతిహత్యయే నాటి న్యాయమని, తెలిసిన వృద్ధమంత్రి హృదయం భయంతో ఒక్కసారి చలించి పోయినది.

ఆహా! కాల వైపరీత్యము — నిత్యకళ్యాణము, పచ్చతోరణమూ అనదగు మాధవవర్మల పాలనలోనా అమంగళం అందునూ యువరాజుల పట్టాభిషేక మహోత్సవమున -అమంగళమప్రతిహత మగుగాక యని చెవులు మూసికొనినాడు. ఈ జరిగిన యుదంతానికి పుత్రుడని ఎంచక మాధవవర్మ విధించు శిక్షయేదో, న్యాయ శాస్త్ర పారంగతుడు ప్రజా స్వామ్య రచనా దక్షుడు అయిన వృద్ధ మంత్రికి బాగుగా తెలియును. అది తలచి కంపించిపోయినాడు.

మహారాజ మాధవవర్మ ధర్మనిరతి యాతని కళ్ళకు కట్టినట్లయింది. న్యాయం, నీతి, ధర్మం సజీవ సిద్ధాంతాలుగా ఎంచి, నిజాయితీని మానముగా తలచి, పరాక్రమవంతుడు, వదాన్యుడూనగు మాధవవర్మలకా - ఎట్టి యిక్కట్టు సంప్రాప్తించినది. కృష్ణ పరమాత్మని సహాయమున దుష్టశిక్షణకు నాందీ పల్కిన పాండవుల వంశమువాడునూ, చంద్రవంశాబ్ధి చంద్రుడునూ యగు మాధవవర్మలకా యిట్టి కఠిన పరీక్ష. [మాధవవర్మ శ్రీరామచంద్రుని తనయుడగు కుశుని వంశము వాడని శ్రీ దూభగుంట నారాయణ కవిగారు చెప్పియుండిరి. అయిననూ కుశుడు సూర్యవంశమువాడు-పాండవులు చంద్ర

వంశజులు — అదియునుగాక కలియుగ ప్రారంభము జనమే జయునితో-కావున వంశనిర్ణయము యోచింపదగ్గ అంశము]

అట్టి మహాత్ముల వంశమం దుద్భవించిన మాధవ వర్మకు ఎంత ఘోర వార్త - వృద్ధుడు కదలి పోయినాడు. ఆతని న్యాయనిలయమున మమతలకు తావేలేదే-ధర్మస్వరూపుడని పేరుగాంచి, ప్రజా హృదయ పీఠముల్పై అలంకృతుడైన యువరాజు విక్రమహేంద్రవర్మ, రిపుగుండెల గండడు. మేళరసు బిరుదాంకితుడు, ఆధర్మం న్యాయం అనే విషనాగుల కాహుతి కావలసినదేనా - అవును, అంతకంటె వేరుమార్గము లేదు. ఆనాటి న్యాయమేయది - హత్యకు ప్రతిహత్యయే — వృద్ధమంత్రి వదనం ముడుచుకొని పోయినది. విజయవాటికా సామ్రాజ్యలక్ష్మి దీనవదనయై తన కట్టెదుట నిలిచినట్లుతోచినది. పూర్వపు అనందం అతనియం దంతరించినది. ఏదో అవ్యక్తావేదన అతని హృదిని కలచివేయ సాగింది.

అల్లిబిల్లిగా అలముకొన్న ఆలోచనా ప్రవాహంనుంచి దరిచేరటాని కుపకరించే సాధనమేదీ ఆతని దృష్టిపథంలో కన్పించలేదు. మాధవవర్మల ధర్మావతారం అతని కళ్ళకు కట్టినట్లయింది. అప్రయత్నంగా చేతులు జోడించాడు. దరహాస వదనంతో కాంతులు నింపుచున్న ఆతనిమూర్తినిగాంచలేక కనులు మూసికొనినాడు.

ఆ వంశ గౌరవ ప్రతిష్టలు అతని మనోఫలకంపై క్షణకాలం మెరిసి మాయమవుతూ మరింత ఖిన్నుడ్ని చేశాయి. విజయవాటికా పురగౌరవం, ఆంధ్ర సామ్రాజ్య ప్రతిష్ఠ ఏమయిపోతాయో అన్న భయం కల్గింది.

# 5

ఆలయ ప్రాంగణమునుండి రాజ ప్రాసాదము నకు షుమారు క్రోసెడు దూరముండవచ్చును. కులముల ననుస రించి ఏర్పాటుచేయబడ్డ వీధులగుండా పోవుచుండెనే గాని, యాతని మనము మాత్రము నిశ్చలముగాలేదు.

దేశకల్యాణానికి, విశ్వశాంతికి, యింద్ర కీలాద్రిపై యవతరించి ధర్మమును నాలుగు పాదములా నడిపింప చేస్తున్న దుర్గాదేవి చరణ రాజీవమా మాధవవర్మకు విషమ స్థితి – విజయవాటికాపురమునకు సంకటస్థితి – కృష్ణవేణితరంగ లాస్యంతో పవిత్రమవుతున్న విజయవాటికా ప్రాంతమునే సరియగు స్థలముగా నిర్దేశించుకుని, పశుపతి నుపాసించి పాశు పతమును సంపాయించిన, విజయుని విజయకారణముననే. అప్పటివరకూ వాటాఖ్యపురమని బరగుచుండిన ఈప్రాంతము విజయవాటిక అయినది.

విజయవాటిక చాల పురాతన నగరము. ఈ పురానికి ప్రకృతి యాభరణం యింద్రకీలాద్రి పర్వతం. నగరము చుట్టునూ కొండలు పెట్టని కోటవలె నిలచియుండుట, యొక ప్రైపున కృష్ణవేణీనది ప్రవహించుట — ఆ పురమునకు క్రొత్త కాంతులు ప్రసరింపచేస్తున్నవి.

కృష్ణానది రెండుకొండల నడుమ ప్రవహించుచున్నది. బెజ్జము (రెండుకొండల నడుమ) గుండా ప్రవహించుటచే ఈప్రాంతము బెజ్జంవాడ అయినది.

వాటాఖ్యుడు ఈ ప్రాంతముననే మరణించుటవలన, ఈప్రాంతమునకు వాటాఖ్యపురియని పేరువచ్చినదట. విజయుని విజయమునకు కారణభూతమీా స్థలమే గావున, ఈ ప్రాంతము విజయపురి అయినదని మరికొందరి అభిప్రాయము.

ఆదిశక్తి దుర్గావతారము, దుర్గమమైన అధర్మములకు శక్తియై, శిష్టులపాలిట కాదంబరియై, అనుగ్రహించుట వలన విజయపురి దినదిన ప్రవర్థమానము చెంది, మహోన్నతాంధ్రుల రాజధాని అయినది. ఈ పుర సౌభాగ్యము నిమిత్తమే దుర్గాంబ, మాధవవర్మ మహారాజునకు ప్రత్యక్షమై వరముల నిచ్చినదనియూ తెలియుచున్నది.

నాచికేతూ పాఖాన కృతిపతి ప్రశంసాసందర్భమున—

" చతురంగ బలములు విజయవాడ దుర్గాంబ
వరమున బడసి దుర్వారలీల
జగతీ స్థలంబెల్ల సాధించి జయశాస
నములు దిగ్దంతి దంతముసలిపి
పేదబాలునకుగా ప్రియసుతు మోహమ్ము
పట్టక బెజాడ పాడెనిల్పి

కలయంగ పురమున కాంచన వర్షంబు
గురియించి, దేవతాకోటి బొగడ

———— ————
———— ————
———— ————

————వసుధ నెగడియన మాధవవర్మ॥ యని

యున్నది.

ఆదిలో శక్తిరూప మిచట యవతరించుటకునూ యొక కథ గలదు. మహిషాసురుడను రాక్షసుని సంహారించుటకై ఆదిశక్తి దుర్గావతార మెత్తి, సింహవాహనమున అరుదెంచి, ఈస్థలముననే యాతని వధించినది. కాని ఆ శక్తిరూపమందు క్రోధము తగ్గలేదు. ఆమెను శాంతపరచు నుద్దేశ్యముతో అరుదెంచిన పరమశివుడునూ ఆమె క్రోధాగ్నికి బలి అయ్యెను. అప్పు డామెయందు పరితాపముదయించి రక్త స్రావమై, జీవింప నిచ్ఛగింపక శిలారూపముదాల్చి, శాంతస్వరూపిణియై భర్తల బ్రోచుచున్నది. యింద్ర కీలాద్రి పర్వతమునానుకునియే కృష్ణానది ప్రవహించుచున్నది. వేణీనాథుడను బ్రాహ్మణ యువకుని, కృష్ణయను వారకాంత ప్రేమించుట, ఆప్రేమలు ఫలించకపోగా, వారిరువురు అచట శోకించి, ఏకమై మరణించుటవలన ఆ నదికి కృష్ణవేణీనది యని పేరు వచ్చెనని యొక చిన్న జానపద గాథ గలదు.

ఇట్టి మహోన్నత చరిత్రగల విజయవాటిక మరుదినపు

మాధవవర్మ న్యాయస్థానమున, ఏమానున్నదోకదా, ఏమయి ననూ యిది యొక తీవ్రతర గొడ్డలిపెట్టు-ఏమి తనకర్తవ్యమో నిర్ణయించుకొన లేకపోయినాడు.

కేవల పురాణసన్నిహితత్వమేగాక, ప్రారంభ కాలము నుండియు విజయవాటికకు పరిపూర్ణ చరిత్ర యున్నది. ప్రాచీన కవుల ప్రబంధాలతో, అభ్యుదయ భావుకుల క్రొంగొత్త పోకడలతో కుందమాల నలంకరించిన వాణి, ఉల్లాసంగా, గలుగల్లున గంతులువేయుచూ మహాకవి దగ్గుపల్లి దుగ్గన, శ్రీనాద కవిసార్వభౌముడు, మొదలగువారితో విహరించిన స్థలమిదియే — మాలలలో పుట్టిన మహాబల పరాక్రమశాలి బద్దన్న సేనాని తన వీర విక్రమ పరాక్రమమును చవిచూప గలిగినదీ విజయవాటికలోనే. మొగలులు దక్షిణాపథముపై దండెత్తినపుడు, వారు తమతమ సైనిక నికాయములకై నిర్దే శించుకొనిన స్థలమే నేటి మొగల్రాజపురము—నాడు మాధవ వర్మ మహారాజుని కోటయుండిన స్థలము - పూర్వ శాత వాహన రాజధాని యిదియేయనియూ, అపురూపపు టంద చందాలకు ప్రతిబింబమై నక్షత్రరాజుల యింటికోడలై, పతి వ్రతామతల్లులకు శిరోధార్యమైన బాలనాగమ్మ జన్మించిన స్థలమిదియే యనియూ కొందరి అభిప్రాయమై యున్నది. విఖ్యాతిచెందిన విక్రమశీల విశ్వ విద్యాలయము, భ్రమ రాంబా మల్లేశ్వర దేవాలయ ప్రాంగణముననే విలసిల్లినదట. చమత్కృతిని ప్రశంసిస్తూ, కోరుకొమ్మనగా చాకలిమరిడయ్య రాయలకోటను కోరగా అప్పాజీ ధీపటిమ కన్గొనిన రాయల

కోట నేటి విజయవాడయం దంతర్భాగమే - మహా మేధా శక్తి సంపన్నులు అక్కన మాదనలు నివసించిన స్థలమిదియే యనియూ, కాళీవర ప్రసాదముననే వారు అమాత్య పదవుల నలంకరించిరనియూ తెలియుచున్నది. నేటికినీ అక్కన మాదన గుహలు కలవు. నేలకొండపల్లియందు జన్మించిన పరమ భక్తాగ్రేసరుడు రామదాసు పెరిగిన స్థలమిదియే--

చరిత్ర ప్రసిద్ధమై, కళల కాలవాలమై, కృష్ణాజలాల లాలనలో పవిత్రిత చెందుతున్న, యీ విజయవాటిక ఒకని నేరమునకు, యొకని రాజనీతికి, కాలగర్భంలో చరిత్రహీను రాలై మంటిలో కలసిపోవలసినదేనా —

వృద్ధుని వదనాన విచార మేఘములావరించినవి — అతని హృదయంలో భీకర రణగొణ ధ్వనులతో తుఫాను ఆరంభమైనది. తను యువరాజు నేరస్థుడై శిక్షింపబడెనను వార్త తెలిసిన ప్రజలహాహాకారములు అతనికి లీలగా గోచరించినవి. ఈ దావానల జ్వాలల నెట్లంత మొందింపవలయునో అతనికి తోచలేదు. ఆదినుంచి ధర్మానికిపెట్టినది పేరు చంద్ర వంశం. ఆవంశానికి వన్నె తెచ్చిన కులాలంకారుడు మాధవ వర్మ—ఈనాడు పుత్రుని విషయంలో వేరుగా వర్తించునా!! భారతీయతకు, ప్రాచీన నాగరికతకు, సాంస్కృతికి పెట్టని కోటగా నిలబడిన ఆంధ్ర సామ్రాజ్య మహోజ్వల చరిత్ర యొక మహారాజుని ధర్మదీక్షకు ఆహుతి కావలెనా - ఏమి న్యాయం - ఆంధ్రమాత అతని న్యాయ నిరతికి అనాధ యగుటయా - ఏమిధర్మం-యుగ యుగాలుగా జనహృదయాల్లో

నాటుకుపోయిన భావ వాద తత్వశాస్త్రానికి మత సాంఘిక మూఢాచారాలకు గొడ్డలిపెట్టై, తిరుగుబాటుగా తలెత్తి సర్వ జన సామరస్యంతో ముందడుగు వేసిన తెలుగుల అభ్యుదయం జన్మించిన ప్రజాస్వామ్యం, యొకని కీర్తికాంతకు బానిసై నిరంతరం ప్రవ్గిపోవలసిన దేనా - ఏమి ధర్మసూత్రమిది—

శైవానికి ప్రాధాన్యతనంది, నీర శైవ పీఠాన్ని (అ దే నేటి వ్యాసపీఠం) తన గళమందలంకరించుకుని ప్రాభవమందిన విజయవాటిక - శైవుడయినా సర్వమత సామరస్యం- శివభక్తుడయినా యితరులకు స్వేచ్ఛ- హరిహరుడై తెలుగు కీర్తికి తెలుగు పుడమిపై సజీవత్వం సిద్ధింపజేసిన మహారాజు మాధవవర్మకు వార్ధక్యంలో ఎంత చిత్త సంక్షోభం.

పట్టాభిషిక్తులయినదాదిగా రాజకాంక్షకు తావీయక దేశ భద్రతయం దేమరుడయి, ఆ ధర్మ కార్య నిర్వహణమందే జీవితమును ప్రజాసేవకై తన శరీరాన్ని అంకితంచేయగలనని, రాజదండము కరమున గొనినాడే శపథము గావించి, ప్రజా సంక్షేమానికి కొత్త ప్రణాళికలు నిర్మించి పురోగమించాడు.

అంతేగాక ప్రజకు పాలనయం దవకాశము నీయసంకల్పించెను. ఆ విషయమై మంత్రి శివశర్మను రావించి ప్రస్తావించినాడు. శివశర్మ ఆనందంతో పులకరించిపోయినాడు-అందుకు కారణము గలదు. శివశర్మ సద్బ్రహ్మచారి. ప్రజాకార్యములు నిర్వహించుటయందు సంసారము జంజాటమని యెంచి

వివాహము మానిన త్యాగశీలి - ప్రజాసేవయే యాతని ప్రధాన లక్ష్యము.

"సంతోషం మహారాజా" అన్నాడు.

"అందుకు ప్రజాసభ అవసరమని తలుస్తున్నాము"

"చిత్తం మహారాజా"

"మంత్రుల సభనుకూడా ఏర్పాటు చేయండి. మిమ్ములను ఆ సభా నాయకుడిగా నియమిస్తున్నాము. ఆ కార్య నిర్వహణయందే నిమగ్నులవండి -మంత్రులసభయే ప్రజాసభను నిర్ణయించవలసి వుంటుంది.

"కాని—"

"ఆగిపోయారేం మహామంత్రీ!"—

"ఏమియునూ లేదు - ప్రాడ్వివాకులు-"అని ఆగిపోయినాడు

"అవును - మరచియుంటిమి - ఏర్పాటుచేయండి- న్యాయమూర్తులు మహామంత్రులే ఆ కార్యక్రమము నిర్వహించగలరు - సముగ్ర రచన సాగించండి—"

ఫలితమే ప్రజాస్వామ్యం - పురసంఘము లేర్పడినవి. రాజ్యశ్యాలకుడు పురసంఘాధ్యక్షుడుగా నియమితుడయినాడు. కాని అవి నేటిలాటి నిర్వీర్యములుకావు. మహామంత్రి నాయకత్వాన ఆ మంత్రులసభ వివేకమున ఎట్టి ఒడుదుడుకులు లేక ప్రజాహిత కార్యములు చేయుచూ పురోగమించినది.

ఇంతియేగాక, తన రాజ్యమునకు యింకనూ భద్రత చేకూర్పదలచి మాధవవర్మ తపోబలమ్మున దుర్గను ప్రత్యక్షము గావించుకొని అపార సైన్య సంపద పొందెననియూ, కళింగుల జయించి, దిక్కులయందు జయ శాసనముల వ్రాయించి, ఆంధ్ర పతాకమును ప్రతిష్ఠించెను. ఈవిషయము ననే పంచతంత్ర గ్రంధకర్త దూభగుంట నారాయణకవి, బసవ భూపాలుని కంకితంబొనరించు సమయాన యిట్లభినందించినాడు—

"మును బెజవాడ దుర్గమును ముగ్ధతనమ్మున మెచ్చజేసె బెంపున రధదంతి వాజిభట భూరిబలంబులచే గళింగభూ
జన పతిద్రుంచి చేవదన సంతతికై మహిఁబాడె నిల్పె గ్ర
మ్మన చిరకీర్తులంగనిన మాధవవర్మ, నిజాన్వయంబునన్॥

పాలనకు రంగానే రాజధానీ నగరమును పునర్నిర్మింప చేసెను. కోట దుర్భేద్యముగా నొనరించెను. సప్తస్వరముల నాలికించు మంటపము లనేకములుకల ఆ ప్రాసాదము అజంతా ఎల్లోరా శిల్పసౌందర్యమును మరపించుచుండెను. రాజాంతఃపురము ప్రత్యేకముగా చలువరాతితో నిర్మింపబడెను.

నూతనముగా నిర్మింపబడిన ఆ రాజధానీ నగరము సౌందర్యమున అమరావతిని, సౌభాగ్యమున అలకాపురిని మించియుండెను—

మాధవవర్మ సభామంటపము మృదుభాషణములతో, కిన్నెర గానాలతో మధుర మంజుల ఘులు ఘల్లను నాట్యా

లతో, నిరంతరానంద హాస్య ప్రలాపములతో కవీశ్వరుల కమనీయ కావ్య కవితా గీతులతో, సకల మణిమయ స్థగిత రత్న కిరీటాంకులతో విలసిల్లు మాధవవర్మ కొలువుకూటము కళావిహీనమై పోవలసినదేనా - క్రూరవిధి భయంకర దారుణ పొగల సెగల యినుపకౌగిలిలో నలిగిపోవలసినదేనా—

వృద్ధుని మానసము చలించిపోయినది. భూనభోంత్రాల్ దద్దరిల్లి, భూమ్యాకాశములేకమై, తననెచటికో తీసికొని పోవుచున్నట్లుండెను. మాధవవర్మ కీర్తికాంతులు వెదజల్లే రత్నకిరీటము మంటిలోబడి దొరలుతున్నట్లు భావించెను. భూమి తలక్రిందులై జలమయమయినట్లు గాన్పించెను. నిలబడుశక్తిగూడా యాతనినుండి దూరమైనది.

ఈరీతిభావనలు మహామంత్రిని ముసురుకొనుటకొక ప్రబలకారణమున్నది. హత్యకుప్రతి హత్యయేయని నాటి శాస్త్రములు ఘోషిల్లుచున్నవి. అంతేగాక అంతకుపూర్వము యిట్టిదే యొక సంఘటన జరిగియున్నది.

ప్రముఖవర్తక శిఖామణియు, అర్థికశాఖా మంత్రియూనైన ధనగుప్తులవారి ఏకైకపుత్రుడు కుమారగుప్తుడు. ఒకనాడశ్వముపై వాహ్యాళికి జనుచుండ, యొకానొక స్త్రీ ఆగిట్టల ప్రహారానికి మరణించినది. ధనగుప్తుడు సామ్రాజ్యమునకు వెన్నెముక - అర్థికశాఖా సచివుడు-మహారాజున కాంతరంగిక మిత్రుడు-తన కుమారుని రక్షింపవలసినదని ఎంతయో ప్రార్థించెను. అయిననూ, ఆ అభియోగమున, మధ్యందిన

భానువోలె కోటిమణి ప్రభలు వెదజల్లుతూ న్యాయపీఠము నలంకరించిన మాధవవర్మ హృదయమునకవి ఎక్కలేదు. ధర్మదేవత యదార్థముగావచ్చి పరిశీలించుచుండెనా యన్నట్లుండెను. ధర్మనిర్ణయము నాకర్ణించుటకువచ్చిన ప్రజ నాశ్చర్యపరచి విభ్రాంతులచేయుటయేగాక ఆతీర్పు ధనగుప్తుని ఆశాసౌధములను గూల్చివేసెను – కుమారగుప్తునికి మరణ దండన విధింపబడినది. ఎంత నిష్పక్షపాతం, ఏమి నిష్కళంక చరిత్ర—

అట్టి యా మహిమాన్వితుడు తన పుత్రుని విషయమున వేరువిధముగా వర్తించునని యనుకొనక ఏమిజరుగున్నాయని ప్రజ ఆసక్తులయి యున్నట్లతనికి తోచినది— మాధవవర్మ న్యాయపక్షపాతియని బాగుగా ఎరిగిన వృద్ధమంత్రి, యువరాజు విషయములో వేరువిధముగా ఎన్నడూ వర్తించడని యనుకొనియెను. ఈ విషమపరిస్థితిని దాటుట యెట్లాయను యాలోచన యాతని మస్తిష్కమున బయలుదేరినది. ఏమియూ దరి గానవచ్చుటలేదు. అప్రయత్నముగా ఆకసమువంక తిరిగి రక్షింపుమని భగవంతుని ప్రార్థించినాడు.

సౌధోపరిభాగమునుండి పురసౌభాగ్యమును, కృష్ణానదీ సైకతములను పరికించు సుందరాంగుల మధురభాషణలు వృద్ధమంత్రిని యోచనాలోకమునుండి యదార్థ ప్రపంచమునకు గొనివచ్చినవి. ఆ సౌధములనుండి జారుతున్న యాతని దృష్టికి భవిష్యత్తంతయూ అంధకారమైనట్లు కన్పట్టెను. అతి మహోన్నతములైన సౌధములు, సౌధోపరిభాగ కుడ్య

లతానికుంజ పంజరముల పలుకుల నొలికించు చిలుకల మధుర భాషణాలకు కిలకిల నవ్వుచూ ఆనందడోలికలలో నూయల లూగు ధనలక్ష్మీలలిత శిరీష కుసుమపేశల శరీరులు, మయూరపింఛముల మరపించు కురులుగల అపరంజిబొమ్మలు, అందానికి శిల్పానికి ప్రతిబింబాలనదగ్గ యువతీలలామల సౌందర్యము రాబోవు నాథుడులేని రాజ్యమున ఏమగునోకదా - అని యోచించుచూ, తడబడుచూ మెల్లన నడచుచుండెను.

వృద్ధమంత్రి తన ఎనుబది వత్సరముల జీవితమున అనేక దుస్సంఘటనలేగాక, యనేక భీకర దండయాత్రలనుసైతము తన ధీశక్తిచే పరిష్కరించిన ఘట్టములున్నవి. అట్టి యాతనికీ సమస్యపై ఒక స్థిరనిర్ణయము రాకుండెను. ఈవిధ యోచనా సముద్రములో దారిగానక బాధపడెడు బాటసారివలె సంచరించుచుండెను. సుడిలోమూకి ఎదురీదుటకంటె, ఆ సుడి గర్భముననే యంతర్ధానమగుట మేలనుకొనినాడు. కాని యంతలోనే గ్రహించినాడు, తనకోరిక సమంజసమైనది గాదని - మాధవవర్మ నొంటరిగా వొదిలిపోవుట కతనిచ్ఛ గింపలేదు. బుద్ధిమంతులు ఆలోచించి ఆరంభించిన కార్యము తుది నెగ్గినదాకా వదలరుకదా - అందునూ రాజ కార్య నిర్వహణాదురంధరుడు, అపర కౌటిల్యుడు, ప్రజా సేమమే జీవితావధి గావించుకున్న నిస్వార్థజీవి, ప్రభుభక్తి పరాయణుడు, ఈ సంఘటనయందు, తన మిత్రుని, సహచరుని, మహారాజును వదలివేయునా—

---

# 6

విపరీత జనకోలాహలము అతని కర్ణములకు సోకెను. అదియే వ్యాపారకీలక కేంద్రమైన విపణివీథియని అతడు గుర్తించెను. వణిక్ప్రముఖులందరూ తమబుద్ధికుశలతను ప్రయోగించి వ్యాపారము నభివృద్ధిగావించి, వ్యాపారరంగము నందు తెల్గులకుగల విశిష్టతనుచాటి, సామ్రాజ్యమునకు వెన్నెముకగా నిలచియుండిరి. పురమునగల ధర్మశాలలు, సత్రములు యిచటివర్తకులే నిర్మించి, తమవదాన్యతను, మాధవవర్మ ధర్మనిరతికి తోడుపరచి ధన్యులైరి. వీరలవలనే వ్యాపార సౌభాగ్యలక్ష్మి ఆంధ్రులసొమ్మాయెను.

అట్లు తలచుచు వృద్ధమంత్రి మెల్లన విపణివీథియందడుగిడి మెల్లన నడిచిపోవుచుండెను. ఈ దినమేలకో విపణివీథి యన్న యతనికి కొలదిగా భయముగలిగినది.

అగ్గిపెట్టెలలో అరుగజముల వస్త్రములు సైతము యిముడ్చ వీలగు అతిసన్నని దేవతావస్త్రములు అమ్మబడు ఆకటిక మదియే - యివన్నియూ భవిష్యత్తున కళావిహీనమై పోవలసినదేనా, యను చింత వృద్ధమంత్రిని కదల్చివేసినది.

కోటానుకోట్ల నాణెములతో రాణించు విపణివీథి

సౌహార్ద్రి సౌభాగ్యత అంతరించి, వైశ్య ప్రముఖులందరూ తను తమమూర్తిత్వాలను కోల్పోవనున్నారుగదా—

అట్టి మహిమాన్వితమైన ఈ విపణివీధియా ఈ ఘోర దురంతమునకు రంగస్థలము ఏమికాలవైపరీత్యము - ఏమిధర్మ పరీక్ష—

అసలీ దారుణ సంఘటన ఎట్లుసంభవమాయెనాయను యాతురత, యాతని హృదయకుహరమున ప్రవేశించి, అను మానములను. ఆలోచనలనూ వెలికినెట్టెను. వృద్ధమంత్రి త్వరత్వరగానడచుట కారంభించినాడు. అట్లే యాతని ఆలో చనలనూ మూకుమ్మడిగా యాతనిని చలింపచేయుచున్నవి— ఆలోచనలంతకంతకూ ఎక్కువగుచునే యుండెను. ఏమయి ననూ యాతనిమానసము, ఆ భయంకరతీర్పును వినుటకు యిచ్ఛగింపలేదు.

ఇట్టి ఆలోచనలతో యాతడు రాజోద్యాన సమీప మునకు వచ్చెను. యథాలాపమున నాతనిదృష్టి యా వన ముపై ప్రసరించెను అప్పుడే యువరాజు విక్రముడు, యువ రాణి ముక్తమాలాదేవివెంటరా ఉపానికుంజవేదికపై వచ్చి యుండెను.

విక్రమహేంద్రవర్మ వదనము ప్రఫుల్లముగా యుండెను. ముఖముపై యచటచ్చట స్వేదబిందువులు కన్పట్టుచున్నవి- బహుశా యాతడిప్పుడే పురవాహ్యాళినుండి వచ్చియుండ వచ్చునని యనుకొని వృద్ధమంత్రి తృప్తిపడినాడు. యువ

రాణిని అక్కునజేర్చుకుని, ఏదియో మాటలాడుచున్నట్లు యాతని పెదవుల కదలికనుబట్టి శివశర్మ గ్రహించెను.

ఏమియీవింత యనుకొనినాడు. మరునిముసమున శిక్షింప బడు యువరాజు యిట్లుండుటకు కారణము-మహారాజువిధించ బోవు శిక్షనుగూర్చి యితడాలోచింపక యుండెనా- లేక నేర విషయమాతనికి తెలియనే తెలియదా - తెలియక జరిగిన నేర మని మహారాజు క్షమించెనా - అటులెన్నటికీ జరుగదు. అట్ల యిన శిక్షవిషయము యితనికింకనూ తెలియపరచి యుండ లేదా - లేక యింతవరకూ శిక్షానిర్ణయమే జరుగలేదా— ఏమియూ నిర్ణయించుకొనలేకపోయినాడు.

యువరాణి ముగ్ధబాలిక — నవయౌవ్వన వనవసంతరాణి జయజయ మంగళ గీతాలతో సమస్త విశ్వసాహిత్య శకుంతాలు, జగన్మనోహరాలను పుష్పింపచేసేటట్టుగా అనంతమైన సౌందర్యరాశిగాచేసి కులికిస్తున్న ఆ ఉద్యానవనమున, లేత చెక్కిళ్లు, పాల్గారు లేతబుగ్గలు, శిల్పరీతి చనుదోయి, కలువలను వెక్కిరించు కనులు గల ఆ సౌందర్యవతి, నవచూత పల్లవ నూతన జీవితో, క్రొంగొత్త కోర్కెలతో, నిరంతరం, ప్రేమవాహినిలో తేలిపోతూ, ఆనందాతిరేకమున మైమరచిపోతూ, అర్ధనిమీలిత నేత్రయైయున్న ఆమె రస ప్రఫుల్ల ప్రసన్న దరహాస వదనాన్ని చూసేసరికి, వృద్ధుని కనుకొలకులనుంచి అప్రయత్నంగా అశ్రుబిందువులు రాలినవి.

మరణించిన యువకునిభార్య శోకమూర్తియై వేయికం

కాలతో శపిస్తూవున్నట్లు తోచినది-పాపం పసుపుబట్టలనడుమ వైధవ్యం-ఏమి భగవంతునిలీలలు-అనుకొనినాడు. ఎన్నియో మమతలుపూరించుకున్న ఆమె లేతహృదయం క్షణకాలంలో వక్కలై శోకభరం అయినది. జీవితమంటే తెలియని, జీవన మాధుర్యం చవిచూడని యువతీత్వమున వితంతువై శేషకాల మంతయూ, అల్లీ బిల్లీ ఆశాలోకపు సరిహద్దుల్లో గడుపవలసి నదేనా - ఆమెహృదయం ఎలా ఘోషిస్తున్నదోకదా-భారత సాంప్రదాయ మూఢతలో ఆమె యొవ్వనము అశ్రు ప్రవాహమున అంతరించి పోవలసినదేనా—

-ఆమె జీవితమట్లు గావించినవ్యక్తి శిక్షార్హుడే అనుకొనినాడు-కాని యువరాజు పరాక్రమవంతుడు-ఈ సమస్యనెట్లు బేధింవవలెను-అన్న విషయంపై ఒక రూపానికి రాలేక పోయినాడు.

అయిననూ మాధవవర్మ అనులోమ వివాహములను ప్రవేశపెట్టియుండెను.

స్త్రీలకు ప్రత్యేక బాధ్యతలీయబడినవి. నాటిస్త్రీలు కేవలము గృహకార్యముల యందేగాక దేశరక్షణా కార్యక్రమములయందునూ పాల్గొనుచుండెడివారు - సరిగా తిండితినలేక పాలిపోయి బంగరువన్నెయని చెప్పుకొను నేటి స్త్రీల వలెగాక, దృఢముగా యుండెడివారు. భర్తనే దైవముగా, మార్గదర్శిగా, అధికారిగా ప్రేమికునిగా ఆరాధించెడివారు - విముఖుడైన భర్తనులాలించి కార్యోన్ముఖుని చేయుట వారికి బాగుగా తెలియును. సత్సంతానము జాతికి

జీవగ్రంథయని వారెంచెడివారు. ఆనంద సామ్రాజ్యరాజ్ఞీత్వమునకు సోపానపంక్తిని నిర్మించుకుని రసప్రవాహమున తేలియాడెడివారు.

భర్త వున్నంతకాలం వేర్వేరు రకాలకోర్కెలతో వేధిస్తూ తము చేసేవి మంచిపనులేనని తలుస్తూ, మగవాడు విసుగెత్తేవరకూ వారిని హింసించి, బాధిస్తున్నామని గుర్తించలేని మగువలు, సదరు భర్త యనబడే ఆమగవాడు భయపడి పారిపోవటమో ఆత్మహత్య చేసికొనటమో లేక కేవల భగవన్నామ స్మరణయూ, భుక్తియూ నిరాఘాటముగాసాగు అరుణాచలక్షేత్రమునకు చేరుటయోజరిగిన తర్వాత – ఆగతించిందంతా ప్రేమ యనుకునో, ఒక మధురానుభూతి యనుకునో అనుకుంటూ, పగటి కలలతోపాటు అర్థంలేని తృప్తి పడుతూ తమ్ము వాసనచూసిన పూలకింద చేసివేశారని, మగజాతి నంతనూ నీచంగాచూడ నారభించేస్త్రీలు మహిళా సంఘాలంటూ మహిమాన్విత సమావేశాలంటూ, కొన్ని వల్లించిన పేర్లజాబితాను వల్లిస్తూ, బయటి జీవితంలో నైతికంగా పతనంచెంది, ఔషధకళాశాలల వుత్పత్తిని ప్రభుత్వ దృక్పథానికి తీసుకువచ్చే ఈనాటి సీతాకోక చిలుకలపలుకుల కులుకులు నాడెచ్చటనూ కానరాకున్నవి—

భర్తలను దైవములుగా ఎంచి, సత్సంతానమును జాతికి ప్రసాదించుచూ, దేశరక్షా కాముకులై వారు మెలగుచుండిరి. — మాధవవర్మల కాలమున అచటచ్చట అనాథ శరణాలయములునూగలవు అయిననూ ఆ యువతిచిరుతప్రాయ

మునసే వైధవ్యము గ్రహింపవలసివచ్చెగదా యను విపరీత ఆందోళన, అవ్యక్తవిషాదం వృద్ధుని మానసాన్ని చలింప జేశాయి. అతనచ్చట నిలబడ లేకపోతున్నాడు-జరుగబోవు దాని తెలుసుకోవాలనే యాతృత - అయిననూ అచటనుండి కదలలేకపోతున్నాడు - ఏమగునో అన్న భయం.

యువరాజ దంపతులలా ఆనందంగా విహరిస్తూవుంటే తనేదో లోకంలో విహరిస్తున్నట్లు భావి చాడు. ఈఆనందం క్షణికమే అనుకున్నాడు. న్యాయమూర్తియని ఎరింగి పరాక్రమవంతుడని, ప్రేమించి, అభ్యుదయ కాముకుడని, వివాహము గావించుకున్న కాకతి రాకుమారి ముక్త మూలాదేవి ఆశలు అడియాశలు కానున్నాయి కదాయని బాధపడినాడు. వారిద్దరూ యిలానే చిరకాలం హాయిగా సుఖంగా వుండాలని మనఃపూర్వకంగా ఆశీర్వదించాడు.-చేతులు జోడించి, ఆకసేమువంకచూస్తూ, "భగనాన్, ప్రేమ స్వరూపుడవు. ఆప్రేమను, ప్రేమ తత్వాన్ని ధ్వంసంకానీయకు. నిరంతరం నీ ప్రేమపూరిత హస్తాల నడుమ వీరిని కాపాడుతూ వుండమని" భగవంతుని ప్రార్థించాడు. నిరాకార, నిరంతన. నిశ్చల నిరంతర, నిర్వికారము, పరబ్రహ్మ యాతని భక్తిపూరిత అమాయిక నిస్వార్థ కోరికను స్వీకరిస్తాడా, ఆదరించగలడా అనే అనుమానం మనకు కల్గిందంటే, అందుకు కారణం నేటి మన దేవాదాయశాఖ, అర్చకులే అంటే అచ్చెరువందనవసరము లేదు. "ఈ ఆపద నడ్డుకోగలశక్తి యొక్క పరమేశ్వరికి తక్క యితరులేరికినీ లేదనుకొనినాడు. అచటనే ఆ యువ

ఆనందోత్సాహాన్ని చూస్తూ నిలుచుండుటకంటె ఈ యాపద నెట్లు తుదముట్టించవలెనో యాలోచించుట మంచిదని ఎంచినాడు.

విశాలమయిన రాచబాట. యిరువైపుల పెద్ద వృక్షములు బారులవలె నిలుచుండి, నీడ యొసంగుచూ, మార్గస్థుల శ్రమను పోగొట్టుచున్నవి. వృద్ధుడు త్వర త్వరగా నడచి ప్రాసాద ప్రధానద్వారముకడకు చేరినాడు. రాజ్యశ్యాలకునికి తన రాకనుగూర్చి తెలియపరచినాడు. సేవకులు ద్వారము తెరచి అభివాదముగావించి, సవినయమున ప్రవేశమిచ్చిరి.

---

# 7

రాజప్రాసాద మతి విశాలమయినది. మాధవవర్మ పాలనకు రాగానే యీ భవనమును గట్టించెను.

ప్రాసాదగోపురము దాటి అంతర్భాగము యందడుగిడి నాడు వృద్ధమంత్రి. ప్రాసాదద్వారము నానుకొనియే గజశాల కలదు. గజశాల నానుకొని అశ్వశాలయున్నది. వీటికెదురుగా రథశాలయూ దానివెనుక కాల్బంట్ల శాలయూగలదు. మహారాజ మాధవవర్మ అహింసావాది. అయిననూ ఆతడు పదిహేనువందల ఏనుగులు, వేయిరథములు, వేలాదివాజులు, అనంతమయిన పదాతిదళము కలిగి, రాజ్యభద్రతా కార్యక్రమముల యందు కూడా ఏమరక శాంతిని సంస్థాపించుటకన్ని విధములా కృషిచేయుటచే నాటి ఆంధ్రసామ్రాజ్యము సుభిక్షమై వెలుగొందినది.

"ఎనిమిదివేల దొరగల ఏనుగులు వడి, నేలద్రొక్క,
త్రొక్కన్ దశలక్షవాజులు కాలునిబోలు పదాతి కోటులున్"
(చా. ప. మ. మం. రెండవ భాగము)

నాటి సైనికులు వేతనములుతిని కూర్చొను సోమరులూ కారు, యుద్ధమునకు మాత్రమే పనికివచ్చు ప్రయోజకులూ కారు. నిరంతరం ప్రజల మధ్య తిరుగుతూ, వారికి

సహకారాన్ని అందజేస్తూ, దేశపురోభివృద్ధి కార్యాల్లో పాల్గొంటూ, దేశబంధువులుగా వర్తిల్లెడివారు.

ఇవి యన్నియు దాటి మహామంత్రి ప్రధానద్వారము చేరినాడు. యింతలో ప్రాసాదాంతర్భాగమునుండి న్యాయ గంటా వినాదకుడు రయమున పర్వెత్తి వచ్చుచుండెను. మహామంత్రిని గుర్తించి ఆగిపోయి అభివాదము గావించి ఆనకై వేచియుండెను. వాని దెసగాంచి శివశర్మ యిట్లు ప్రవేశించెను.

"విశేష మేమయినా యుండియుండెనా—"

"చిత్తము - మహారాజులు తమ సన్నిధికి వేంచేయుమని–"

"మమ్మలనా—"

"చిత్తము—"

"కారణ మెరుంగుదువా—"

"చిత్తము – న్యాయసభ నత్యంతావశ్యకముగా నేర్పాటు చేయుటకు"

"అట్టి అవసర విషయ మేమైయుండును—"

"యువరాజుల రథచక్రములబడి ఒక యువకు డసువులు "బాసెను—"

"యదార్థమా"

"యదార్థమే మంత్రివరేణ్యా — ఆ యువకుని ముదుసలి

తల్లి, నాయగంటను మ్రోయించి న్యాయము గూర్పుమని ప్రార్థించుచున్నది—"

"అది యెట్లు — నీకు తెలిసినంతవరకూ విషయము—"

"చిత్రము. మహారాజుల ఏకైకసంతానమగు మేళరసు బిరుదాంకితులు యువరాజు విక్రమహేంద్రవర్మల పట్టాభిషేకము, రేపటి దినమున జరుగనున్నది—"

"అనియే వినియుంటిమి — నాకా విషయము బాగుగా జ్ఞప్తి యందుండుటచేతనే సమయమునకు రాగలిగితిని—"

"మహారాజుల ఆజ్ఞకూడా నదియే - తమరాకను తెల్పుమనియే

"అట్లే జరుగునుగాక — కాని ఈ జరిగిన ఘోర సంఘటనా వివరములు తెలియ నామనము వ్విళ్లూరుచున్నది. కావున తత్సంబంధ విషయము లన్నియూ, వివరముగ సత్వరమే నివేదించుము—అని యచటనేయున్న ఒకవేదికపై యుపవిష్టుడయ్యెను.

మరల మహామంత్రియే "ఆ చనిపోయిన యువకుడెవరు" అని ప్రశ్నించెను. "చింతకాయలమ్ముకొను ఒక ముదుసలి కొడుకు - విపణివీధియందు లేఖకుడు. నామము తెలియదు.

"తరువాత—"

"పది దినముల క్రితమే యాతనికి వివాహము జరిగినది. ప్రతి దినము మాదిరిగనే ఈ దినమునూ యాతడు అంగడికి చను

చుండ, దురదృష్టవశమ్మున యిట్టి యిక్కట్టు సంభవించినది. యువరాజుల రథముక్రిందబడి నలిగిపోయినాడు.

"యువరాజులంత అజాగ్రత్తగా యుండిరా—

"అజాగ్రత్త యనుటకు వీలులేదు—

"సారథి యెవరు—"

"లేరు - స్వయం చోదకత్వమున వాహ్యాళికి బయలుదేరిరి-

"ప్రాతఃకాలమున వాహ్యాళియా—.

"కాదు దేవా - పట్టాభిషిక్తులు, ముందుగనే ప్రజాశీర్వచన మందుట మన దేశ యాచారమని తమకు తెలియనదికాదు-"

"సరియే - ఆ సంగతి మాకు తెలియును - యథాతథముగా జరిగిన సంగతియంతయూ విన్నవించుకొనుము"

"దేవా, అవధరింపుము. ప్రాతఃకాలముననేమేల్కాంచి యువరాజులు అభ్యంగన స్నానంబాచరించిరి. ఇంతలో పెద్ద ముత్తయిదువులు పేర్మిచూపుతో అరుదెంచి మంగళ హారతు లిచ్చిరి-ఆ హారతులతోపాటుగనే, పూర్వాంబుధిన భానుం డుదయించెను. కాషాయాంబరధారియైన పరమశివుడు తన నిజవాత్సల్యమును ప్రజపై బరపుటకేతెంచినట్లు. పద ములు లేనివాని చోదకత్వమున, సోమరితన అంధత్వమును ప్రజబారినుండి బర్వోత్తించుటకునూ. కాంతి పుంజములనే జ్ఞానోదయమును ప్రజాహృదయముల హత్తుకొనుటకై,సహస్ర కిరణాయుత భానుడు రయమున సాగజొచ్చెను. స్వర్ణ భాను

కిరణములు, మణిమయ స్థగిత ప్రాకార బహిర్భాగమునబడి, చామంతి పూలహారముగొని యువరాజు పట్టాభిషేక ఆనంద మహోత్సవమున జయాభిషేకముల నొనరించుటకు పుష్ప మాలాలంకృతుని చేయ సమకట్టినవా యనునట్లు చలువరాతి మంటపాలునూ వింత కాంతులీనుచు పట్టాభిషేక మహోత్స వమునకు నాందీయా యన్పించుచుండెను.

భానోదయమగుసరికి, యువరాజుల మంగళాదికము లునూ పూర్తయినవి. అనంతరము యువరాజులు పితృదేవుల సందర్శనార్థము వేంచేసిరి. — నమస్కరించినారు, మహా రాజులును ఆనందమును పట్టలేక యువరాజులను గాఢముగా హృదయమునకు హత్తుకుని ఆశీర్వదించినారు. అనంతరము మహారాజులు యువరాజుల దెసగాంచి యిటుల చెప్పనా కారంభించినారు. — తమ వంశము మహోన్నతమనియూ పూర్వీకులు గొప్పవారనియూ, వారి మాదిరిగనే నిరంతరం ప్రజాసేవకై జీవిత మంకితం బొనర్పుమనియూ చెప్పిరి. వారందరునూ, సకలమత సాంఘిక ఆర్థిక విషయములయందు సమానత్వం సాధించిరనియు అటులే వర్తింపుమనియూ ప్రబో ధించిరి. — అని నాటివిషయములనుగూర్చి చెప్పి, నేటి రాజ కీయ పరిస్థితులను స్థూలముగా చెప్పిరి. ప్రజాసేవయు, ప్రజా క్షేమము, ప్రజారక్షయే రాజధ్యేయమనియూ నిత్యము ప్రజా హృదులకు సన్నిహితముగానుండుమనియూ మనవిచేసిరి. తమ వంశ గౌరవ ప్రతిష్ఠలనూ, వంశాచారములనూ చెప్పుచు రాజులు తరచు ప్రజామధ్యమునకువెళ్ళి వారి యోగక్షేమ

ములు కన్గొనవలయుననియూ, ఆకార్యాచరణకు ఈ దినము నుండియే దీక్షవహించుమనియూ, ప్రథమమున ప్రజాశీస్సుల నంది రమ్మనియూ నిర్దేశించిరి. అప్పుడు యువరాజులు ఖడ్గము కేలగొని, ప్రజకై తన జీవితం అర్పణచేస్తానని ప్రతిన గావించిన యనంతరము మరల మహారాజులు యిటులచెప్పిరి. మంత్రిసభ సహకారంతోనూ, ప్రజాసభ అంగీకారంతోనూ, ప్రాడ్వివాక్కుల సహాయంతోనూ, పాలనా విషయముల యందు శ్రద్ధవహిస్తూ, అతిజాగరూకతన వ్యవహరిస్తూ, జన రంజకుడనై కీర్తికాంతనుచేపట్టి, వంశప్రతిష్ఠా గౌరవములు వృద్ధిచేసి ధర్మనిరతుడవై, న్యాయమూర్తివై, అరివీరభయం కరుడనై, సత్యాహింసల కలిమిబలిమితో ముందడుగువేస్తూ, నిరంతరం భోగలాలసుడవై ప్రజాద్రవ్యమును వెచ్చించక, సామ్రాజ్యరక్షణా కార్యక్రమముల యందేమరకయుంటూ, విలాసవినోదములనూ పరిమితము చేసికొనుచూ వర్తించమని, చెప్పగా యువరాజులు మరల యొకసారి ఖడ్గముధరించి మహారాజునకు నమస్కరించిరి

"తరువాత—"

"కళలు మానవ హృదయములను పాలించగలవు. కావున లలితకళాభివృద్ధికై పాటుపడుచూ కవిపండిత గాయకశిల్పులను గౌరవించమనియూ, తద్వారా రాజభక్తి, దైవచింతన, దేశ క్షేమం, రాజ్యభద్రత, సహకార సుజీవనము మున్నగు విష యములను ప్రచారము చేయవలసినదిగా చెప్పిరి. మరల మరల రాజ్య రక్షణయందు నిమగ్నమై యుండుమని హెచ్చ

రించినారు-యిది యిట్లుండ నిన్నటిదినమొక సంఘటన జరిగినది. అదియే ఈనాటి యిన్ని యిక్కట్లకు కారణభూతము-

"ఏమది—

"పాంచాలదేశమునుండి యొక త్వాయంత వర్తకుడు వచ్చియుండెను. అతనికడ మేలుజాతికి చెందిన అశ్వరాజములున్నవి. పట్టాభిషేక మహోత్సవమున, యువరాజుల రథమునకు పూన్చుటకు రెండు పంచకళ్యాణి హయములను మహారాజులు యెంచినారు. యువరాజులునూ, ఆ వైజయంతములను చూచి హర్షముతో ప్రఫుల్లమందినారు.

"తదుపరి యేమి జరిగినది"

"మహారాజులు బోధించిన విషయములను మననం చేసికొంటూ, హృదయమునకు హత్తుకొనగా అంతఃపురమునకు జేరి, మాతృదేవి మహారాణి చంపకమాలినీ దేవిగారి ఆశీర్వచనమంది, యువరాజులు - చిరునవ్వు అధరములపై నాట్యమాడుచుండ చిరుసిగ్గుతో యటకరుదెంచి, యువరాణి తమ మృదుహస్తములతో కుంకుమ రేఖలను నుదుటను దిద్దినయనంతరము, యువతులు అర్పించిన మంగళహారతులు స్వీకరించి, యిష్టదేవత నారాధించి, ప్రజాశీస్సుల నందుటకై వాహ్యాళి బయలుదేరిరి-ఆ రథమునకు క్రొత్త పంచకళ్యాణి గుర్రములు ఆయుత్తపరచబడినవి-అపుడు అశ్వ శిక్షకుడు వలదని వారించెను-"

"ఏమనుచు—"

"ఆ అశ్వములు శిక్షణలేనివనియూ, వాటిని రథమునకు సిద్ధముచేయుట అత్యంతప్రమాదకరమని సవినయముగా మనవి చేసికొనినాడు-యువరాజులు ఆగ్రహావేశులైరి - సహజప్రజ్ఞ, పరాక్రమము, విరాజతేజముగల యువరాజులు తమ శక్తిని శంకించి, అవమానించుచున్నావని హెచ్చరించగా నాడునూ మారు మాట్లాడక క్షమాభిక్షనర్థించి, రథమునకా గుర్రములనమర్చెను"

"అశ్వ శిక్షకుని మాటలు వినియుండిననూ యింత చేటు వచ్చియుండెడిది కాదుగదా—"

"యువరాజులు రథమునధిరోహించిరి—చోదకత్వమును నిర్వహించుటకై సారథిరా యువరాజులు వానిని వలదని వారించినారు.

"సారథియూ లేని రథికుడాయెనా మన యువరాజు—ఎట్టి వికలసంఘటన"

"అవును ప్రభూ — యువరాజులు బహుముఖ ప్రజ్ఞతో, అత్యంత చాకచక్యమున చనుచుండిరి. యువరాజుల గాకవిని ప్రజ సంతోషాంతరంగులైరి. పూబోడులు పుష్పవర్షమును కురిపించుచుండిరి — దారిపొడవునా మంగళగీతికలుపాడి, మంగళహారతులు నిచ్చుచుండిరి పెద్ద ముత్తయిదువులు పేర్మిదృష్టిన యువరాజును వీక్షించుచూ, ఆశీస్సుల నందచేయుచుండిరి.

అనంత భావాలయాలై విశ్వవిశ్వంభరా సామ్రాజ్యాన్ని తమ కైవసము గావించుకుని గృహసీమను ఆనంద మంజులస్వనాలతో స్వర్గసీమగా చేయుచుండెడి మెరపుతీవ శరీరులు, అద్భుత మొలికించు యలంకరణలు సొంపునింపు చుండ, చిత్తర్వు సౌందర్యమున బాట కిరువైపులా శిల్పరీతి నిలుచుండి మంగళగీతిక లాలపించుచుండ, యువరాజులు, మూర్తీభవించిన సౌందర్యదేవత కైవసమై యువరాజవదన రాజీవమందు వెల్లివిరియు, దరహాసమున చిరునవ్వులొల్కించుచూ, మెల్లన సాగుచునుండ మానవులేగాక సౌధోపరి భాగముననున్న పంజరములలోని చిలుకలుగూడ జయగీతికలు పాడసాగాయి. బాలరసాలసాల నవపల్లవ కోమలములను మేయుచూ, కాకదత్త పుత్రికలు, తమ గళమున పంచమ స్వరముతో శుభకాంక్షలను కాబోలు పల్లవించుచున్నవి.

ఈవార్త క్షణకాలముననే రాజధాని నగరమంతయూ తెలిసిపోయెను. ప్రజ ఆనందోత్సాహములతో యువరాజ దర్శనార్థమురాగా, యువరాజులునూ వారుచేయు అభివాదములు సవినయమున స్వీకరించుచూ, గావించు జయఘోషలకు చిరునవ్వున సమాధానము నిచ్చుచూ, మెల్లన విపణివీధి ప్రాంతమునకు చేరిరి.

"ఈ ఘోరసంఘటన జరిగిన ప్రదేశ మదియేగా"—

"అవును, మహామంత్రి పుంగవా — ఆంధ్ర భృత్య వంశముల కాలమునుండియూ అభివృద్ధి చెందుచూ వచ్చిన వర్తకను, విష్ణువర్ధన వంశాగ్రగణ్యులు, కులాలంకారులూ

నగు శ్రీ శ్రీ శ్రీ మాధవవర్మ మహారాజుల కాలమున, అపరకౌటిల్యులు, జ్ఞానవయోవృద్ధులూ, మహామంత్రులూ నగు శివశర్మామాత్యులు సహాయముగానుండ, వాణిజ్యము హిమాచలోన్నత శిఖరాగ్రమునంటి ఆంధ్రకీర్తి నల్దెసల క్రిమ్మినది. యితర ద్వీపములతో నౌకా వ్యాపారముకూడా నాడుండెను. యితర రాజ్యములతోడను, విదేశములతోడను నాడు వర్తకము విరివిగా సాగుచుండెను.

అందుచేత మన దేశమునందుగల ఈ వస్తువులను తమ దేశమునకు గొనిపోయి తమ దేశమునందుగల సుగంధ ద్రవ్యములను, జావా సుమిత్రా వర్తకులు మనకిచ్చెడివారు.

పాంచాల, కోసల, చాళుక్య మున్నగు సామ్రాజ్యములు తమతమ వర్తకుల నిచటికంపి, నానావిధ వస్తుసముదాయములనూ విక్రయించి, విజయవాటికనుండి వారికి గావలసిన వస్తువులను గొంపోవుచుండిరి. అందున విపణివీధి ఎల్లవేళలయందు సమ్మర్దముగను, సందోహమ్ముగను యుండి నానాదేశ వాసులతోనిండి కనులపండువుగా యుండును. వివిధ జాతులవారునూ, వివిధ భాషలవారునూ వచ్చుచుండుటచేత అచట నానాజాతి భాషా సామరస్యమును, పరస్పర స్నేహభావమున మెలంగుటవలన యావిపణివీధి అత్యంత ప్రాధాన్యత వహించి రాజ్యరక్షణ కనుకూలత నిచ్చుచుండెను.

వ్యాపారమునకై వచ్చిన వర్తకులేగాక, రాజధాని అన్నిప్రాంతములనుండి వచ్చిన ప్రజ అటగుమిగూడి యుండు

టచే నుకింత సమ్మర్దమ్ముగా యుండెను. విపణివీథి గావున అచట ఎల్లవేళల యందునూ రక్షకభటులు కాపుందురు. మాధవవర్మ ఈవిషయమున ఎక్కువ శ్రద్ధ వహించెను. అక్రమ వ్యాపారము, దొంగతనము జరుగకుండా యరికట్టుటకు భటులతోపాటు అధికారి నొకనిగూడా నియమించెను. వీరలేగాక సదాచారులు అన్ని విషయములనూ గమనించుచునే యుందురు.

దేవా! అచట చేరినప్రజ ఆనందోత్సాహములతో పాటు వారి హృదయములయందు ఆతృతయూ ఎక్కువాయెను. వారి కోర్కెను మన్నించెనా యన్నట్లు యింతలో యువరాజులు అధిరోహించిన రథము అచటికి వచ్చి చేరినది.

వైశ్యప్రముఖులు వీధికెదుగను నిలుచుండి యువరాజులను పుష్పమాలాలాంకృతుని గావించి స్వాగతము పల్కిరి. యువరాజులు ప్రసన్న వదనమున సహజ వినయముట్టిపడ, ఆనందాతిరేకముననున్న ప్రజదెస తిరిగి అభివాదము సల్పిరి. ప్రజలు తమ ప్రియతమ నాయకుని గాంచుటయేగాక వారి సహజవినయమునూ గాంచినవారై, సంతృప్తిచెంది, మహోత్సాహమున, భూనభోంతరాళ్ దద్దరిల్లి దిక్కులు పిక్కటిల్లు నట్లు హర్షజయ ధ్వానములు గావించిరి.—

" అటుపిమ్మట—

" దేవా—అదియే ప్రమాదముగా పరిణమించినది-అంగరక్షకులునూ అశ్వశిక్షకుడునూ, జన సమూహమునుదోసికొని ముందుకు రాలేక, యువరాజ రథమును చేరలేకపోయిరి -"

"యువరాజులు ఒంటరి యయ్యెనా—"

"చిత్తము దేవా - సహజముగా గొప్పవి - శిక్షణ లేని చుట్టివి యగు అశ్వసమంతములు, యింత పెద్ద ఎత్తున నున్న కోలాహలమునకు బెదిరి, పర్వెత్తుట కారంభించినవి. యిటూ నటూ యిచ్ఛవచ్చినట్లు అవ్వశ్యాశ్వములు పర్వెత్తు చుండ ఎందరో ఆపుటకు యత్నించిరి. కాని ఎవరి ప్రయ త్నమూ సఫలము కాలేదు. — తగిన చోదకుడు లేకపోవుట వలననూ, కొత్త గుర్రములగుట వలననూ యిట్టి యిక్కట్టు సంభవించెనని అశ్వశిక్షకుని అభిప్రాయమై యున్నది.

ఆ అశ్వములు అటూ నిటూ బెదరి పర్వెత్తుటగాంచిన ప్రజలు భయవిహ్వలులై హాహాపుడిగా, తప్పుకొనుటకు యత్నించుచూ, ఒకరి నొకరు త్రోసికొనుచూ. ప్రక్క ప్రక్కకు తొలగిపోవుచుండిరి.

ఆనందోత్సాహ మంతయూ క్షణకాలమున భయో త్పాతమయ్యెను ఆకసమున మెఱపు మెరసినట్లు చీకటిని పారద్రోలుచూ అవతరించిన మెరుపు బంగారు తీవవలె ఆవాజులు ఆకసమున కెగిరిపోవుచున్నవాలన్పించుచున్నవి.

ప్రభూ — అప్పుడు షుమారు తొమ్మిదిగడియలై యుండును. అప్పుడే తమ తమ కార్యములు నిర్వర్తించుకొను టకై లేఖకులునూ, తదితరులునూ ఏతెంచుచుండిరి — అది యునూ గాక యువరాజదర్శనా అకాంక్ష.—

ఆ విపణివీధి చివరను యొక ముసలి చింతకాయ

లమ్ముకొనుచూ జీవించుచున్నది. ఆమెను జూచిన రాజ్య క్షేమాభివృద్ధికై వృద్ధులు సైతమెట్లు పాటుపడుచున్నారో తేటతెల్ల మగును. ఆమె ఏకైక పుత్రుడే యువరాజ రథమున కాహుతైన వ్యక్తి.

"ఆముదుసలి తన చరమదశలో ఎంత దుఃఖము భరింపవలసి వచ్చినది—

"అంతియేనా ప్రభూ — అతను వివాహితుడు — యువరాజుల వివాహము జరిగిన మరుచటి దినమే యాతని వివాహము జరిగినది. క్రొత్త వలపులతో ఆశాసౌధాలు నిర్మించుకున్న ఆ యువతి చిరకాలము వైధవ్యము ననుభ వించవలసినదేగా—"

"అవసరములేదు. యొక వంశమువారు, వేరొక విభిన్నవంశముతో వియ్యమందుటకు, విఘ్నలేగాక మన ధర్మ శాస్త్రములునూ అంగీకరించుచున్నవి. వాటినే మనము అనులోమ వివాహము లనుచున్నాము. వాటికి, ఈ విధవా వివాహములను సులువుగా అన్వయింప వచ్చును. ధనగుప్తుల వారు తమ కోడలియెడ ఈ రకముగా వ్యవహరించి, ఆమె జీవితమునకొక ప్రయోజనముచూపి, మనకందరకు ఆదర్శ ప్రాయులు కాలేదా, అదియునుగాక, మాధవవర్మ మహా రాజులపాలనలో ఎవరూ శోకతప్తులు కానక్కరలేదు. — కాని వృద్ధులమైన మాకు బాధలననేమో బాగుగా తెలి యును. కాన బాధనందు మంటిమి. అంతేకాని వేరుకాదు.

నిరుపేద యీ వృద్ధమాతయెడ అదే జాతికిచెందిన, నీకెం తెయూ అభిమానముండుట సమంజసము, సహజ మూనై యున్నవి. కాని యందు విషయమున మాత్రము, ఎట్టి పరిస్థితులయందునూ, ఆవేదన చెందనవసరములేదు. కావున ముందు వృత్తాంతమును, త్వరితముగా విన్నవింపుము"

"చిత్తము - యువకుడొక లేఖకుడు. తల్లి శెలవునంది విధినిర్వహణకొరకై అంగడికేతెంచు సమయమది. యువ రాజ రథము అటూ నిటూ పర్వెత్తు సమయమున కాతడూ అచటనే యుండెను. అతడునూ, అందరితోపాటు తప్పించు కొని బయటపడుదమన్న యుద్దేశ్యమున ప్రక్క ప్రక్కలకు తొలగుచుండెను. కాని ఆనైజ యంత్ర శ్రేష్టములు జయజయ ధ్యాన నియుక్తులైన ప్రజనుగాంచి బెదరి - వేటగాని బారి నుండి తప్పించుకొను లేడివలె, వేగ మార్గమునుండి అటూ నిటూ పర్వెత్తు పక్షివలె, యిచ్చవచ్చినట్లు పర్వెత్తుచున్నవి.

కనుమూసి తెరచినంతకాలము — యువకునికడకు రథమువచ్చినది — యాతడునూ, శాయశక్తులా ప్రయత్నిం చెను కాని ప్రక్కకు ఒత్తిగిలలేక పోయెను. - యొక మూర్త కాలము - వాయువేగ మనోవేగముల, ఆఘుమేఘముల తేలి యాడుచున్న, ఆతురంగముల బారినుండి తప్పించుకొనలేక పోయినాడు. మరియొక ఘడియగడచినది. రథము ముందుకు కదలిపోయినది. ఒక భయంకర ఆర్తనాదము వినవచ్చినది. కాని ఆ ఆర్తనాదము ప్రజ హాహాకారములలో కలసిపోయి నది. బాట రక్తసిక్త మయినది. — ప్రభూ, ఏమి చెప్ప

పొందురు. ఆ అభాగ్యుడు ఆ అశ్వక్రూర పదఘట్టనలకు నలిగి పోయినాడు. అతనితల చితికిపోయినది — ఆయువకుడు మరణించినాడు''

వృద్ధమంత్రి ఆవార్తవిని నిశ్చేష్టుడైనాడు—

''ఆహాయముల నడుపులోనుంచు నుద్యోగములో యువరాజులు యిది గమనించలేదని నొక్కి వక్కాణింప వచ్చును. అదియును గాక అతిత్వరగా పోవుచున్న ఆరథమున నున్నవారికి, ప్రక్కన జరుగు విషయములు కేవలము లీలగా మాత్రమే గోచరించును.

ఈ విషయమును ఎవరోగాని ముదుసలికి తెలియపరచినారు. ఆమె గోలు గోలున రోదించుచూ అచటికగుదెంచినది. ఆశవముపైబడి ఏడ్చెడి ఆ ముదుసలిని చూచినవారి హృదయములు నీరయ్యెను. ఇంతలో ఆ యువకుని భార్యయూ వచ్చినది. ఆమే యింకనూ పసుపుబట్టలువిప్పియుండలేదు - వివాహ తోరణము లింకనూ యట్లేయున్నవి. ఏమి కాల చిత్ర విచిత్రపు రీతులు. వివాహమై పదునారు దినములు కాలేదు. జీవితమన నేమియో తెలియదు - జీవన మాధురిని గ్రోలియుండలేదు. ఏమిచేయగలదు - వివాహము వరకునూ అతడెవరో యామెకు తెలియదు. అగ్నిహోత్రము ఎదురుగా, ప్రమాణముగావించి వారిరువురకూ, గృహస్థాశ్రమమును స్వీకరించిరి. అయిననూ వారిరువురూ యింకనూ సన్నిహితత్వ మేర్పడి యుండలేదు. ఆమె యట్లే, హృదయము వ్రక్కలై, రుధిరములేక పాలిపోయినదా యన్నట్లు

కనులప్పగించి చూచుచు, చలనములేక కట్టెవోలె నిల్చుండి పోయినది.

ఇంతలో యెవరో ఆ సమూహమునుండి న్యాయస్థాన మునుగూర్చి, గురుతుచేసినారు. ముదుసలి ఈ విషయమును న్యాయాధికారి సమక్షమునకు తీసుకు రాదలచి బయలు దేరినది - మాధవవర్మ న్యాయనిరతి, అచట జరిగిన యుదంతము, ఎరింగిన ప్రజలెన్ని విధములుగనో ప్రాధేయపూర్వకముగా, ఆగుమనియూ, ఈవిషయమునూ మాఫుచేయవలసినదనియూ అడిగిరిగాని, అందువల్ల యెట్టి ప్రయోజనమునూ లేకపోయినది.

ఆ సమయమునకే ప్రజాహితులు, ఆదర్శప్రాయులు, అపర కుబేరులు, అర్థిక శాఖామాత్యులు నగు ధనగుప్తులవారేతెంచిరి. ప్రజ సవినయముగా వారికి దారినిచ్చినది.— వారా యువకుని శవముపై భాష్పబిందువులు రాల్చినారు. పట్టాభిషేకానంద మహోత్సవమున యిట్టి విషాద సంఘటనయా యని విచారించినారు.

" ధనగుప్తుడునూ ఏతెంచెనా — పుత్రశోక పరితప్తుడగు యాతని హృదయము పూర్తి ప్రతీకారమును వాంఛించుచున్నట్లున్నది— యాతడేమనెను—

"అట్లేతెంచిన ధనగుప్తులు ముదుసలి నుద్దేశించి, తానా యువకుని ఆకస్మిక మరణమునకు చింతించుచున్నాననియూ, అయిననూ ఈవిషయము అత్యంత ప్రాధాన్యత

కలిగియున్నదనియూ, సామాన్యమైనదిగా ఎంచుటకు వీలు లేనిదనియూ, కావున త్వరపడి న్యాయాధికారుల దృష్టికి తీసుకురావలసిన అవసరమెంతైనా కలదనియూ చెప్పిరి.

ముదుసలియూ, యువకుని శవమును తీసికొని కోడలు వెంటరా — న్యాయగంట ప్రమోగించినది. ద్వారికులు ఆమెను ప్రవేశపెట్టిరి. అపుడు మహారాజులు, వుపావేదికపై గూర్చుండి పురసౌభాగ్యమును జూచుచు అలోచనా నిమ మగ్నులై యుండిరి. —

ముదుసలి ప్రవేశించి అభివాదము గావించి, విషయమంతయూ సవిస్తరముగా మనవిచేసి కొనినది.— తదుపరి మన సామ్రాజ్యాచారమైన అంత్య ప్రార్ధనకై భ్రమరాంబా మల్లేశ్వర దేవాలయమునకు చనినది. సాయం త్రమూ విషయము విచారించుటకై అత్యవసర న్యాయస్థాన మేర్పాటుకు నన్ను నియోగించిరి.

“సరియే - యిక నీవు నీపనియందు నిమగ్నమవ వచ్చును” అని మహామంత్రి నుడువగా వాడునూ సవినయ మున మరల నభివాదము గావించి త్వరగా అచటనుంచి కదలిపోయెను.

వృద్ధుని మానసము కల్లోలసంద్రమైనది. ఆలోచనలు విపరీతముగా మొలకలెత్తుచుండెను. మానసము కృంగిపోవు చుండెను. అతని ఎద కల్లోల సముద్రతరంగ ఘోషతోనిండి యుండెను. —. అందునూ పుత్రశోక పరితప్తులు ధనగుప్తుల

వారింకు అత్యంత శ్రద్ధాసక్తులై యుండుట గమనించిన — వృద్ధమంత్రి మరింతగా చలించిపోయెను. — ఎట్లయిననూ ఈవిపత్తుదాటుట కుపాయాంతర మాలోచింప వలయును. అందుకు ప్రథమమున మహారాజులను దర్శించుటత్యంతావశ్యకమని తలచి, మెల్లన ఆరామశాలలుదాటి రాజాంతఃపురమును జేరినాడు.

చలువరాతి మంటపములతో అలరారుచున్న ఆ అంతఃపురమును దాటగనే, యొక విశాలమంటపముగలదు. ఎటు చూచినా నిశ్శబ్దము తాండవించుచూ, శోకదేవత మూర్తీభవించియుండెనా యన్నట్లుండెను. - వున్నవారందరునూ చ్ఛాయలతో నిస్తబ్ధులుగా యుండిరి.

గోడలకు గచ్చుపని చేసియుండెను. పైకప్పు అత్యున్నతముగాయుండి, విశాలముగా కన్పట్టుచున్నది. నానా దేశ చిత్తర్వులు అలంకరింపబడి మందిరము మరింత శోభాయమానముగా కన్పట్టుచున్నది. ఆ విశాలమంటపము నానుకొనియే అభ్యంతర మందిరము దానికి దాపుననే పడకగదియూ యున్నవి.

ఆ అభ్యంతర మందిర మతిసుందరము - శిల్పమునకు స్థానము. కళామతల్లికి నవ్య నీరాజన మొసంగుచున్నదా యన్నట్లు వింత కాంతులొసగుచు, క్రొత్తసొగసు కన్పట్టుచుండెను. ఆ మందిరమందే కళింగ విజయానంతరము గ్రహించిన నానాజాతి రత్నసముదాయ ముండెను. నానా

దేశాలకు చెందిన వింత మనస్తత్వాలను వ్యక్తీకరింపచేసే, ప్రముఖ కళాకారుల లలితసృష్టి యనదగు వ్యూహాచిత్రములతోనూ, అలంకరింపబడి యున్నది కుడ్యములపై నానారక వర్ణములతో లతలు పక్షులు చిత్రించబడియున్నవి. ఒక కుడ్యముపై ఉదాసీనతవహించిన అర్జునునికి గీతోపదేశము గావించుచున్న కృష్ణభగవానుని, ఆ పరమాత్మున కుపదేశించుచున్న భానుమహాశయుని గూర్చిన చిత్రము లలంకరింపబడి యున్నవి. ఆగదికి తూర్పున యొక గవాక్షమున్నది. ఆగవాక్షము చేరువనే కళింగవిజయ యాత్రనుగూర్చిన చిత్రములున్నవి. ఆప్రక్కనే యొక చలువరాతి వేదికపై మాధవవర్మ కూర్చుండి ఏదియో, సహజ గంభీరవదనంతో, మూతలు పడుతున్న కళ్ళతో, శూన్యంలోనికిచూస్తూ ఆలోచిస్తుండెను. ఆయనను చూచిన ఏరికైననూ విచారము కలుగకమానదు. ఈ వృద్ధాప్యమున ఎంతకష్టము. ఏమి చేయునలయునను యోచన మాధవవర్మను వీడిరాకున్నది. అనుపమానానంద తరంగలోలుడై, యింత విచిత్ర సంఘుకదంబమును కోటి నక్షత్ర నయనాలతో పరికించి, పరిశీలించి విజ్ఞాన విలాస వికాసరేఖలు మొలిపించి కురిపించుటకుగాను పైశాచిక తాండవముల నరికట్టుటకు నీలమేఘుడై యవతరించి, మెరుపుల వురుముల మందలించి, పన్నీరు తొలకరించి, అప్రతిహతమైన యీ కీకారణ్య మహోద్భృత ఘాతుకులను దారిలో నుంచలేక సతమతమవుతూ, కన్నుల వెన్నెల గాయలేక యిల్లి కాంత వాసియై, అకస్మాత్తుగా అవతరించిన అంధకారాన్ని అవలికి

నెట్టుట కుపాయాంతరము గాబోలు యోచించు చున్నాడు. ఆయన గంభీరవదనము నందించుక విషాదచ్ఛాయ ఉలము కొని యుండెను.

యింతలో మహామంత్రి శివశర్మ అరుదెంచినాడు అభివాదము గావించినాడు. ఆ అభివాదముతో యదార్ధ ప్రపంచమునకువచ్చి, శివశర్మను కూర్చొనుమని సైగచేసినాడు.

---

# 8

అప్పటింతసేపో శివశర్మ మౌనముగా కూర్చొనియుం డెను. యిరువురి హృదయములు మొక్కపోయినవి. ఏదియో ఆకాంక్ష ఆతురత వారి హృదయముల కల్లోలపరచుటచే, నోటి మాటలులేక నిస్తబ్ధులై కూర్చుండి యుండిరి. — ఆగది యందు నిశబ్దము తాండవించు చున్నది. ఆ నిశ్శబ్దాన్ని చీలుస్తూ శివశర్మయే సంభాషణ కుపక్రమించినాడు.

"మహారాజా—"

మాధవవర్మ దీనంగా తలెత్తి అతనివంక చూశాడు.

"రాష్ట్రికూటులు సరిహద్దు లతిక్రమించిరనునది కేవల మసత్యము. సరిహద్దున నున్న —

"విన్నారా మహామంత్రీ" అన్నాడు మాధవవర్మ వుద్విగ్నంగా.—

"విన్నాను ప్రభూ - ఆ దుస్సంఘటన నామనమును కలచివేసినది - అందుపై - ఆగిపోయాడు శివశర్మ - న్యాయ విరుద్ధ విషయములు మాధవవర్మ ఎదుట మాట్లాడుటంత మం చిదికాదని అతనికి బాగుగా తెలియును. అందుచేతనే తనసం భాషణనాపి యాతని ముఖాన్ని పరిశీలించసాగాడు.

"అమాత్యా—"

"ప్రభూ—"

"యిందభిప్రాయమున కేమున్నది. న్యాయ స్థాన మున్నది - న్యాయమూర్తులున్నారు"

"మహారాజా—"

"అవును శర్మామాత్యా — న్యాయ శాస్త్రమును బాంధవ్యముతో ముడిపెట్టుటంత మంచిపని కాదు.—

"అయిననూ—"

"మమతలకు స్థానమిచ్చి, ఆ మాధుర్యంలో, మానవత్వాన్ని పతనం గావించుకుని, మానవధర్మాన్ని విస్మరించి, పవిత్రమైన నీతిన్యాయాలను విసర్జించమంటారా మహామంత్రీ మాధనవర్మ అధర్మవాదియై నిజపుత్రుని ఎడ పక్షపాతము చూపెననునింద సార్థక్యములో నేను భరింపలేను.—"

"అందులకు కాదు మహారాజా - కొలదిమార్పు అవసరమని—"

"మార్పు మానవులలో రావాలిగాని, ధర్మశాస్త్రంలో గాదనిరమ్మంటారా—"

"అనికాదు—"

"మరేమిటి మహామంత్రీ"

"ఏమియునూలేదు - ఈవిషయమున" అని ఆగిపోయినాడు

"ఆగిపోయారేం"

"ఉద్విగ్నత చెందక శాంతంగా యోచించండి మహా

రాజా - ఈ విషయము పవిత్రాంధ్ర సామ్రాజ్య భవితవ్యము నకు చెందినది. "

" అందులకై—? ప్రశ్నార్థకంగా మహామంత్రి ముఖాన్ని పరిశీలించాడు.—

" ఏమియునూ లేదు - ఈ నేరమును పొరపాటుగా అంగీకరించిన—

" మహామంత్రీ- జరిగినది పొరపాటయిననూ పోయిన దొక నిండు ప్రాణముకదా—

" అయిననూ —. యింకేం చెప్పాలో అర్థంకాలేదు మహామంత్రికి—

" వార్థక్య దోషమున, విష్ణుకుండిన వర్ధన వంశగౌరవ ప్రతిష్టలు విస్మరిస్తున్నారా - నీతికి న్యాయానికి పెట్టని కోటగా నిలచిన మా వంశ ఘనతను మా నియమాన్ని శంకిస్తున్నారా - మా ప్రతిన తమకు గుర్తులేదా—

" అంత అదృష్టవంతుణ్ణికాను మహారాజా - అదే సత్యమయిన పక్షమున యీ వార్తను చెవిని పెట్టకయే యుందును. యీ విషయమును గూర్చి ఆలోచింపకయే యుందును.—కాని... కాని— వృద్ధుని పెదవులు వణక సాగాయి -" మహారాజా-అనేక దిగ్విజయ యాత్రలలో విజయ లక్ష్మిని కైవసము చేసికొని, అరివీర భయంకరులై, అహింసా మూర్తులై, సత్యవ్రతులై, ఆదిశక్తి ఉపాసకులై, అపర ధర్మావతారులై, ప్రజాస్వామ్య నిర్వహణా దక్షులై వేయి

క్రతువులును, పదునొకండు అశ్వమేధయాగాలునూ గావించి, తెలుగుకీర్తికి పుడమిపై సజీవత్వము గలుగచేసి, దిగదిగంతాల తెలుగు ఘనతను విస్తృతముచేసి, రాష్ట్రాంతరాల తెలుగు జయపతాక చ్ఛాయల ప్రసరింపజేసి. లలిత కళల కాలవాలమగునట్లు రాజధానీ నగరమును పునర్నిర్మింపచేసి నిర్వీర్యమైపోతున్న ఆంధ్రజాతిని మేల్కొల్పి దేశ రక్షణా భద్రతలయందునూ, పురోభివృద్ధి కార్యములందునూ పాల్గొని ముందడుగు వేయునట్లు బాధ్యతా నిర్వహణమును ప్రజా హృదయముల బాదుకొల్పి, విశ్వ విశ్వాంతరాళంలో జీవించివ ప్రతి మానవుడి రక్తనాళ స్పందనలోనూ, అణువణువునా మూర్తీభవ తెలుగుతనాన్ని ఘోషిల్లునట్లు గావించి శత్రుకాంత మైనను ఆదరించి చంపకమాలినీ దేవిని వివాహము గావించుకున్న అసమాన శేముషీధీశాలి మాధవవర్మ మహారాజునకు బాల్యంబున సహాధ్యాయినై, యౌవ్వనమున చెలికాడనై, నిజశత్రువధ యందునూ జైత్రయాత్రలయందును దక్షిణహస్తంబునై ప్రజాస్వామ్యరచనా దక్షుండనై, మహామంత్రినై, సామ్రాజ్య భారమంతయూ, భుజస్కంధములపై మోపిన నాకింకనూ మతిస్థిమితముగనే యున్నది మహారాజా—''

"మీ ఆవేదన మాకు తెలియనిది కాదు. న్యాయశాస్త్రములనుగాని ధర్మనిర్ణయములనుగాని, మేము మార్చలేము - అందులకు మేము పూర్తిగా అశక్తులము. న్యాయ నిర్ణయము యథాతథముగనే యుండును.—''

"మహారాజా - మార్పుచాలా అవసరం"

"మన అవసరాలకోసం న్యాయశాస్త్రంలోని పుటలు చించివేయమంటారా మహామంత్రీ—"

"ప్రభూ"

"అటు లెన్నటికినీ జరుగదు. మీరిదేపోయి న్యాయ సభ కేర్పాట్లు గావించుడు - అని త్వరత్వరగా యటనుండి కదలిపోయెను.

వృద్ధమంత్రి కంపించిపోయినాడు - ఏమిచేయుటకునూ అతనికి పాలుపోలేదు - అటులే కూలబడిపోయినాడు ఏవిధ ముగనూ సమస్య పరిష్కరణామార్గ మతనికితోచ లేదు. మెల్లనలేచి, విషాదభరమున, తడబడు అడుగులతో నిజగృహోన్ముఖుడయినాడు.

---

# 9

నేడు వార్ధక్యమున శరీరము శుష్కించిపోయిననూ దేహము ముడుతలుపడిననూ అతని ప్రస్ఫుటమగు కనుగోయి నుండి పట్టుదల, స్థిరత్వము స్ఫుటముగా కన్పట్టుచున్నవి. మాధవవర్మ నేడు అత్యంత విషాదభరమ్మున యుండెను.

అతనిపాలన ప్రజానురంజకము, ప్రజాహిత నిరంకుశము, - ప్రజాస్వామ్యప్రారంభ మూతనిపాలన - అతని కాలషున పాలనాసౌలభ్యములు చాలగలవు. ఆకాలమున విద్యావ్యాప్తికి అమిత ప్రాధాన్యతీయబడినది. భ్రమరాంబా మల్లేశ్వర దేవాలయప్రాంగణమున నాటి విద్యాలయముండెడిది. తెలుగుబాష నాటి ప్రజ వాడుకభాషయై, రాజభాషయై పోషింపబడి మిక్కిలి ప్రాముఖ్యత నందుచుండెను.

విష్ణుకుండిన వర్ధన వంశస్థులు ధర్మావతారులు—వర్ణాశ్రమ ధర్మములను రక్షించెడివారు - బ్రాహ్మణ భక్తియూ, ఆచార్య పూజయూ, నాడు మెండుగానుండెను. హిందూమతావలంబకులైననూ, యితరమత వైషమ్యము లేక సర్వమత సామరస్యము చూపెడివారు - కులమతములు, వాటి ధర్మములు ఆచరింపబడినవి గాని ఆ విభేధములు నాడు లేక, పరస్పరం అర్ధంచేసికొని సహకార సుజీవనముంది, నాటి శ్రేణులు పురోగమించినారు. అందులకూ సర్వ కారణ భూతుడూ మాధవవర్మయే—

మాధవవర్మ దుర్గాభక్తుడు. రాజ్యమునకు రాగానే దుర్గాదేవి నుపాసించి, ప్రత్యక్షము గావించుకుని, అపార సైన్య సంపదనంది, దుష్టులు, పరదాస్య ప్రోత్సాహకులు అయిన రాజుల మట్టువెట్టి దుష్టశిక్షణ యొనర్చి ధన్యుడాయెను.

మాధవవర్మ గొప్ప యుద్ధవీరుడు. తన వంశనిర్మూలనానికి యత్నించిన కళింగులపై దాడివెడలి ఆ జనపతిని సంహరించి కళింగమును, ఆంధ్ర సామ్రాజ్యమున కలిపి, తెలుగు జయపతాక చ్ఛాయల సర్వత్రా ప్రసరింపచేసి ధన్యుడయినాడు. కళింగ జనపతి కుమార్తె చంపకమాలినీదేవి తనను వలచి రాగా ఆదరించి వివాహమాడిన ధీరశాంతుడీతడు.

ప్రజాధనము ప్రజలకొరకు వెచ్చింపబడెడిది. అట్టి యుద్దేశ్యము గల్గినవారు కావుననే ప్రజాస్వామ్యమేర్పడినది. రాజ విలాస వినోదములు పరిమితము చేయబడినవి - వృద్ధ మంత్రి శివశర్మ సహాయమున ప్రజాస్వామ్య రచన సాగించి, ప్రజాసభనూ, ప్రాడ్వివాక్కుల సభనూ ఏర్పాటు గావించి, వారి సహాయ సహకారాంగీకారములతో, ధర్మమును నాలుగు పాదములా నడిపింపచేయుచూ ప్రజలకు ప్రభుత్వముపై విశ్వాసమునూ, ప్రభువుకు ప్రజపై యభిమానమూ, యుండునట్లు చేసెను. ఇందుకనుకూలించు మంత్రుల సభనూ యాతడేర్పాటు గావించెను — నాటి మంత్రులు నిస్వార్థ కార్యవాదులు - నేటివారివలె స్వార్థవాదులు కాక ప్రజా క్షేమమే తమ క్షేమమని ఎంచెడి త్యాగశీలురు. ఆనాటి పాల

నను మంత్రులసభ నిర్వర్తించుచుండెడిది మంత్రుల సభ యందు నవమంత్రు లుండెడివారు. యీ మంత్రుల సభయే ప్రజాసభపై అజమాయిషీ వహించెడిది.

మహామంత్రి ఆ సభకు నాయకుడు. మహామంత్రియే చారశాఖను, దేశవ్యవహారములనూ చూచుచుండును. నగరవైశ్యాధిపతి స్కంధగుప్తుడు వ్యాపార విషయముల గమనించుచూ వ్యాపారమభివృద్ధి గాంచునట్లు చేసెను. ధనమన్న జాగ్రత్త కలవారునూ ధనవిషయ పరిజ్ఞానము కలవారునూ, లక్ష్మీపుత్రులూనగు వైశ్యులు ఆర్థిక శాఖామాత్యులుగానున్న ప్రణాళికలు జయప్రదమగునని ఎంచి మాధవవర్మ, ధనగుప్తులవారిని అందులకై నియోగించెను - సరసప్రౌఢ కవిత్వసమ్మేళన చక్రవర్తి ప్రజలకందని గ్రాంధిక భాష ఏలయను అభిప్రాయము కలవారునూ నాచికేతూపాఖ్యానమును రచించిన యట్టి మహాకవి దగ్గుపల్లి దుగ్గనను విద్యామంత్రిగా నియమించి విద్యావ్యాప్తికి సరియగు మార్గమును నిర్మించెను. సామాన్య రైతు కుటుంబమునుంచి యొక వ్యవసాయదారుని ఎన్నుకొని, యాతని సేద్యగణకులుగా నియమించి వ్యవసాయాభివృద్ధి గావించెను. బాహుబల పరాక్రమ తేజము గలిగిన తన చిన్ననాటి మిత్రుడు చండసేనుని దళవాయిగా నియమించెను. రాజబంధువులను యితర రాజ్యమునుంచి వచ్చిన యతిథులను, విదేశీయ రాయబారులను గౌరవించుటకునూ, యితర రాజ్యములతో స్నేహమభివృద్ధి

పరచుటకునూ, ఒక శాఖనేర్పరచి, (రాయసము) ఆశాఖకు రాజబంధువు నొకని నియమించెను. రాజధానీ నగర రక్షణ వ్యవహారములను రాజ్యశ్యాలకుడు గమనించునట్లునూ, రాజ్యమునకు సంబంధించిన విషయములను రక్షకుడునూ, న్యాయ శాఖను స్థానాపతియూ గమనించెడివారు-స్థానాపతే ప్రాడ్వివాక్కు-ల సభకధ్యక్షత వహించును - ముఖ్యమంత్రి ఆ సభకు ప్రధాన న్యాయమూర్తి.

ఆకాలమున రాజనీతి నాలుగు విధములుగా విభజింపబడియుండెను. రాజ్యరక్షణ, పాలన, పురపాలన, శిక్షావిభాగము - మాధవవర్మ రాజ్యమును మండలములుగా విభజించి మండలములకు అధినేతలుగా రాజబంధువులను నియమించెను. తిరిగి మండలములను పాళెములుగా విభజించి, పాళెపాలన గ్రామపంచాయితీల కొసంగెను.

మాధవవర్మ కాలమున, రాజ్యము విస్తీర్ణముగాంచెను మత సామరస్య మేర్పడెను. ప్రజాస్వామ్య ప్రభుత్వములు ప్రారంభమయినవి. తెలుగుతనము మూర్తీభవించినది. ధర్మ సంస్థాపనము జరిగినది. అంతియేకాక ఈతని కాలమున క్రొత్త ధర్మములేర్పడెను. అనులోమ వివాహముల నేర్పాటు గావించెను అందుకు ప్రథమముగా వేరొక విభిన్నవంశమునుండి అనగా కాకతీవంశమునుండి ఒక కన్యను తన కుమారునికి వివాహము గావించెను. బాల్యవితంతువులకీ వివాహము లన్వయించి వితంతు వివాహములకునూ నాందీపల్కెను. మతాంతర వివాహములుకూడా నాడు జరుగుచుండెడివి.

ఇన్ని విషయముల యందు సమాన దక్షతా పరి జ్ఞానముగల్గి అపర ధర్మావతారులని పేరునంది, రామరాజ్యా న్ని మరిపింపచేయు పాలనా సౌలభ్యములు నేర్పాటుగావిం చిన మాధవవర్మ, అంగరక్షకులు లేక, ప్రైవారాములు లేక, యొంటిగా దీనవదనుడై సభకరుదెంచుట గాంచిన, యా సభా సదుల హృదయములు వ్రక్కలైనవి.

---

# 10

మాధవవర్మ సభా భవనమున ప్రవేశించెను. విదేశ పరరాజ్య రాయబారులతో, రాజ ప్రతినిధులతో, పట్టాభిషేకోత్సవమునకు వచ్చిన ప్రతినిధులతో; పురజ్ఞాన వయోవృద్ధులతో, సర్వజనాదరణీయమైన మంత్రులసభతో, ఏమి జరుగునోయను ఆకాంక్షతో వచ్చిన ప్రజా సమూహముతో సభాభవనము కిక్కిరిసియుండెను,

మహారాజాగమనముతో నారందరునూ సవినయమున లేచి నిలువబడి జయధ్వానముల గావించిరి – అందరి కంఠములు విషాదముతో పూడికొనిపోయి యుండుటచే అ జయధ్వానములు సైతము విషాదగీతిక లాలపించినట్లున్నవి.

మహారాజు తన పీఠముపై ఆసీనుడయ్యెను. మహారాజునకు దక్షిణమున మహామంత్రియు, ప్రత్యేక పీఠమున దగ్గుపల్లి దుగ్గన్నయు, వామమున మంత్రులసభయూ, మంత్రులసభ నానుకుని ప్రజాసభయూ, ఎదురుగా తీర్పు వినవచ్చిన అశేష జనసమూహమును, మహామంత్రి నానుకుని పరదేశ రాయబారులు, యితర రాజ్య ప్రతినిధులు ఆసీనులయి యుండిరి. మహారాజు పీఠమునకు క్రిందిభాగమున ప్రాడ్వివాక్కుల సభ కూర్చునియున్నది – విషణ్ణుడై సింహాసనమున గూర్చుండిన మాధవవర్మను గాంచిన వారి హృదయములు నీరయ్యెను.

# 11

సభా భవనమున నిశ్శబ్దము తాండవమాడుచుండెను- ఎంతటి ధీరుడైననూ పుత్రశోకమున పరితప్తుడగుట సహజము గాబోలు. నేడభియోగమును విచారించవలసిన అయిదుగురు సభ్యులుగల ప్రాడ్వివాక్కుల సభయు అత్యంత విషాదమున యున్నది. నేడు నారలే విచారణ జరుపవలసి యుండెను. యువరాజు మరుదినము కాబోవు ఆంధ్ర సామ్రాజ్యాధినేత నేడొక సామాన్యునివలె విచారింపబడవలయును. ఆహా, ఏమి ఆ న్యాయదీక్ష, తెలుగుల అకుంఠిత ధర్మదీక్ష ఎటువంటిది! ఏమి మహారాజ మాధవవర్మ ధర్మనిరతి——

మహోన్నత వ్యక్తిత్వము, అవిరళదాతృత్వము అనివార్య పరాక్రమ తేజము మూర్తీభవించిన యువరాజులు, చరిత్ర ప్రసిద్ధిగాంచిన మేళరసు బిరుదాంకితులు, నిర్వ్యాక పరాక్రమ క్రమ విభాసుర తేజ విరాజభోజులు, తెలియక, చూడక, అనుకోకుండా జరిగిన యొక పొరపాటునకు, అతి సామాన్య మానవునివలె, న్యాయసభ సమక్షాన, ప్రజా సమక్షాన, విచారింపబడుటయా! తమ ప్రియపుత్రులు, పరాక్రమవంతులు, యువరాజులు, న్యాయ మూర్తులు, కాబోవు మహాంధ్ర సామ్రాజ్య చక్రవర్తులూ, అయిన యువరాజు విక్రమహేంద్రవర్మను, అతి సామాన్యునిగా నిలవబెట్టి విచా

రింప బూనుట యొక్క మాధవవర్మ మహారాజునకే చెల్లినది.

ఇట్టి మహోన్నత త్యాగనిరతి, ధర్మదీక్ష మన దేశ చరిత్ర పుటలు తిరుగవేసిన మనకెచ్చటనూ గానరాదు— ఇట్టిది ప్రపంచ చరిత్రలోనే లేదని నిస్సంశయముగా, నొక్కి, వక్కాణింపవచ్చును.

వావి వరుసలు పాటించక, రాజు, మంత్రి, పరదేశీయులతో నీచంగా ప్రవర్తించి, దేశములను యుద్ధరంగాలుగా యొనర్చిన స్త్రీ చరిత్రలు.—

ప్రజా ద్రవ్యమును తమ విలాసాలకై వినోదాలకై సంబరాలకై. వెచ్చించుట - మదిరా మదవతులకై వెచ్చించుటలు-జరిపి, ప్రజలను దీనులుగా చేసిన రాజుల చరిత్రలు -

యుద్ధములు, వాటికారణములు, ఫలితములు, సంస్థలు రాజుల వివాహములు, వారి అక్రమ బాంధవ్యాలు, ప్రేమలు ఫలింపచేసికొనుటలు, మొదలగువాటిని చర్చించే చరిత్రలు -

కేవలమాట పట్టింపులకు, గిల్లి కజ్జాలకు తావిచ్చి, వైషమ్యాలు పెంచుకుని యితర దేశీయుల సహాయంతో పరస్పరం నాశనమైన వారి చరిత్రలు —

దేశాన్ని జాతిని, పరదేశీయులకమ్మి, బానిసత్వమునకు నాందీపలికిన నీచులతోనిండిన చరిత్రలు—

కేవల మూర్ఖతకు రాజ్యకాంక్షకులోనై మహాభయంకర

యుద్ధములు గావించి ప్రజ మానప్రాణములనేగాక కోట్లాది ద్రవ్యమును వెచ్చించి, శాంతిసౌభాగ్యాలు కొరవడునట్లు వర్తించి, యిది ఏమని ఎదురు తిరిగిన ప్రజకు విప్లకారులని పేరిడి, వారిని చిత్రహింసలకు గురిచేసినవారి చరిత్రలు—

అర్ధంపర్ధంలేని యోచనలకు తావిచ్చి రాజధానులను మార్చి ప్రజా వినాశానికి కారకులైన పిచ్చివారి చరిత్రలు.

ఒక స్త్రీకోసం రాజ్యాలనుసహితం పోగొట్టుకొనుట యో, ప్రాణాలర్పించుటయో జరిగిన కథలు, – అద్దానికి మహాత్యాగమని కీర్తించే చరిత్రలు—

ధీరత్వము కొరవడి, పరరాజుల చేతిక్రింది నీరుత్రాగిన రాజులను, అహింసామూర్తులని పేరిడి కీర్తించే పురాణాల లాటి చరిత్రలు—

మత ప్రచారంనికై యుద్ధములనూ యువతులనూ, ఆధారము చేసికొన్న, మతాధిపతుల చరిత్రలు—

అనుకరించి, గ్రంథాలను వ్రాసినవారిని మహాకవులని కీర్తించే చరిత్రలు—

నాటి దేశకాలపాత్రములనూ, రాజ్యక్షేమమునూ ఎంచక దేశరక్షణా భద్రతలకు తిలోదకాలిచ్చి, ఒకానొక ప్రియురాలు తన ప్రియతమ భార్యకోసం, కోట్లకొలది ధనాన్ని, ప్రజాశక్తిని వెచ్చించిన ఒక మూర్ఖుడ్ని, గొప్ప వాడిగా, కళాభిమానిగా కీర్తించే చరిత్రలు – ఆతని తరు వాతనే ధనాభావముచే రాజ్యములు నిర్వీర్యములవ పరదేశీ

యులకు మాతృభూమి నప్పగించిన, కంకుష్టుల స్వార్థదోష భూయిష్ట చరిత్రలతో నిండిన చరిత్రకు మాధవవర్మ చరిత్రొక గీటురాయి కదా—

ఏమతని న్యాయవాక్య పరిపాలన - రామచంద్రుని వంశమున యుద్భవించిన యాతని ధర్మదీక్ష అంచులు దాటినది.—

ఏకాదశాశ్వమేధ యాగములునూ, క్రతు సహస్రములనూ యొనరించిన (ద్రాక్షారామశాసనము) మహిమాన్విత మాధవవర్మమూర్తి, నేడు పుత్రునికూడా కోల్పోవనున్న అదృష్టహీన మైనది కదా—

యిట్టి మహనీయుని చరిత్ర, నేటి చరిత్రలయందు కానబడకుండుట అత్యంత శోచనీయము. అయిననూ, సతతా విశ్వాస సస్యప్రరోహమునకు గీటురాయివలె పాటుపడు, నేటి చరిత్ర శోధనాధికారుల దృష్టికిగాని, ప్రభుత్వమువారి దృష్టికి గాని కానంబడకుండుట అత్యంత శోచనీయము కాదేమో.-

తన రాజ్యమున, తన న్యాయస్థానమున తనే విధించు శిక్షకు, పుత్రహీనుడై, నిరంతరశోకతప్తుడై క్రుమ్మగ్గిపోవలసిన దేనా.—

---

# 12

జగజ్జనని విశ్వశాంతి సముద్ధాత్రి మహాకాళీ వరప్రసాదమున సైన్యసహాయమందిన మాధవవర్మ. నూతన ధర్మముల పరివేశపెట్టి వ్యథితహృదయాలను చిగురింపచేసిన యీ మాధవవర్మ - మహిమాన్వితాంధ్ర వ్యక్తిత్వాన్ని తెలిపి, తెలుగు జయపతాక ప్రతిష్ఠాపనార్థం కంకణం గట్టుకున్న మాధవవర్మ దీనవదనము ప్రజాహృదయముల కలచివేసినది. రుధికములేక పాలిపోయిన యీతని ముఖవర్చస్సును గాంచి, యీతని సహచరులు చలితులయిరి.

అంతియేగాక మాధవవర్మ అశ్వమేధ యాగమును యౌవ్వనముననేగావించిన చరితార్థుడు. అందుచేతనే యీతని కాలమున తెలుగుకీర్తి దిగంతాల వ్యాపించినది. అట్టి దిగంతాల వ్యాపించిన తెలుగుకీర్తి, తెలుగు పుడమిపై, తెలుగు న్యాయస్థానమున, తను విధించు శిక్షకు పుత్రహీనుడగుటయేగాక, యొక తల్లికి పుత్రశోకము, యొక కన్యకు భర్తృ వియోగము, తెలుగు సామ్రాజ్యము నాథుడులేనిదగుటయూ సంభవింపనున్నదికదా ——

అదియునుగాక మాధవవర్మ కళాహృదయుడు. లలిత కళలన్న ప్రీతి - సాహిత్యమన్న అభిరుచి మెండు - నన్నయ తిక్కన, ఎర్రాప్రెగ్గడలతో ఆగిపోయిన ఆంధ్ర కవిత్వము

మరల యీతని కాలమున తలయెత్తి, ప్రవర్ధమానము చెంది నది. నాడు సాహిత్యమున గ్రామ్య గ్రాంథిక సమ్మేళనము నకు స్థానమీయబడినది. దగ్గుపల్లి దుగ్గన్నమహాకవి ఈతని యాస్థానకవి. దుగ్గనచే రచింపబడ్డ నాచికేతూపాఖ్యా నమును, మాధవవర్మయే కృతినందియుండెను.

ప్రఖ్యాతిచెందిన యిట్టి మాధవవర్మ చరిత్ర వాసి న్నుతికెక్కినను చరిత్రకారుల దృష్టికింకనూ రాలేదు. యీతని గూర్చిన పూర్తివివరములింకనూ సేకరింపబడలేదు. బహుశా ఆ పరిశోధించుటలోగూడా యేమయినా అభిప్రాయ బేధములు వచ్చినవేమో - ఆరంభ శూరత్వపు ఆంధ్ర జాతి యందుద్భవించుట వలననో - లేక పరిశోధకుల పక్షపాత దృష్టివలననో లేక ప్రభుత్వాదృష్టి యిట్టి పవిత్ర కార్యాచరణ యందు మగ్నము కాకపోవుటయో ఏమయినసేమి ఆ మ హిమాన్వితుని చరిత్ర యింతవరకునూ ప్రచురింపబడి యుండ లేదు.

బాల్య వితంతువులకు అనులోమ వివాహముల నన్వ యింపచేసి, మోడువారి ఎండిపోయిన వారి జీవిత ఆశాలతల మరల నీరువోసి పుష్పింపచేసిన మాధవవర్మ ఆశాలతలే నేడెండిపోవ సిద్ధముగా యున్నవి.

---

# 13

మహారాజాసీనుడైన యనంతరము భట్టారకులు జాతీయ గీతముల గానముచేసిరి. ఆ గానములిట్లుండెను—

"ఆ కరసప్తకంబున విహారముసల్పెడిసామరస్య ని
ర్వ్యాకపరాక్రమ క్రమవిభాసుర తేజవిరాజశాంతి మం
దాకినివై ప్రపంచ పరితాపము మాన్చెడి కల్పభూ
జమా
నీకిదె వందనమ్ము కరుణించు తెలుంగు పతాకమా
రహిన్ ॥

॥ జయ సకలాంధ్రీ – వేదకాల సంవేదిత దిక్పురంధ్రీ
జయపావన గౌతమీ – సాధు వారి పరిపాలిత
జయ కృష్ణవేణి సభంగజలతరంగ పరితోషిత
జయాంధ్ర రాజ్య – మహిమాన్విత
మాననీయ చక్రవర్తి జయహో ॥

సభ మరల నిశబ్దమాయెను. ఉచ్ఛ్వాస నిశ్వాసములు తప్ప మరేమియూ విన్పడుటలేదు. మాధవవర్మ యపుడు చేత రాజదండమును ధరించి, తెచ్చిపెట్టుకున్న చిరునవ్వుతో మహామంత్రి దెసగాంచినాడు.

మహామంత్రి శివశర్మ తన యాసనమునుండి లేచి నిలువబడినాడు. సభనంతయూ యొక్కమాటు పరికించి

నాడు - అందరునూ ఆసక్తితో నుండుట గమనించినాడు. సభాసదుల నుద్దేశించి యిట్లు పల్కినాడు—

సభాస్థలి నలంకరించిన పెద్దలారా-

ఈనాడు జరిగినదొక దుస్స ఘటన - అనుకోకుండా జరిగినది. మన హృదయముల నెంతయో కలచివేసినది - మాధవవర్మల పాలనలో మమతలకుగాని, బాంధవ్యమునకు గాని తావులేదు కావుననే న్యాయ విచారణ మావశ్యకమైనది. అది అత్యవసరమయి యున్నది - కాని ఈనాటి అభియోగము విచారించుటకు నేనశక్తుడను—'' అని ఆగిపోయెను —

''అటుల జరుగుటకు వీలులేదు. కారణమేమన మీరే లేని పక్షమున ఈ దుఃఖసముద్రమునుండి దరిచేర్చగల తగిన నావికుడెవరున్నారని ప్రజ గగ్గోలుగా అరచిరి.

" అట్లు తలుపవద్దు - ఎందరో మహానుభావులీ సభ యందుపవిష్టులై యున్నారు

" అయిననూసరే - తమరే ఆ పదవిని నిర్వహింపగల సమర్థులు ''

" క్షమింపుడు. ఏలయన, ప్రత్యేకముగా నావిషయమున, వార్ధక్యదోషము ప్రయాణ బడలికయూ మెండుగా యున్నవి - అంతియేగాని వేరుకారణ మొండులేదు. కావున వేరువిధముగా తలంచక నన్ను క్షమింపుడు. నేనీ కార్యక్రమమును నిర్వహింపలేను.

అందరునూ నిశ్శబ్దులైరి. వృద్ధమంత్రి సభాధ్యక్ష పీఠము నలంకరించినమా కొంతవరకూ యువరాజులకు ప్రాణా పాయము తప్పునని ఎంచిన ప్రజకు ఆశాభంగము కల్గినది -- వారి యాశలు అడియాశలైనవి - ఏమి చేయవలయునో ఎవరికినీ తోచలేదు. అపుడు ప్రధాన దళవాయి, మాధవ వర్మకు చిన్ననాటి మిత్రుడునూ యగు చండసేనుడు మహా మంత్రినిచూచి యిట్లు పలికెను—

"ఆర్యా - యిపుడేమి చేయవలయునని తమయుద్దే శ్యము" మరల మహామంత్రిలేచి నిలుచుండి -

"ఆర్యులారా — నేనిటుల పల్కుటకు వేరొండు కారణమునూ గలదు. ఏమన ఈనాటి విషయము సామాన్యమయినది కాదు. చరిత్ర ప్రసిద్ధమగు విషయము.

———అధర్మముగా తీర్పువచ్చెనా, పవిత్రాంధ్ర సామ్రాజ్య కీర్తియూ, మహిమాన్విత మాధవవర్మ మహారాజుని ధర్మనిరతియూ నాశమైపోగలవు. ధర్మ పక్షము ననే తీర్పయొసంగిన, తెలుగుతల్లి గోడ్రాలై, తెనుగు సామ్రాజ్య మనాథమై కాలగర్భమున కలసిపోవుట, మహారాజునకు తీరని పుత్రశోకము, తెలుగు ప్రజలు రాజులేని రాజ్యమున నివ సించు అనాథులగుటయూ తటస్థ పడగలవు - కావున యిది పరమ ప్రమాదకరమైన సంకటస్థితి—

"అందుననే, తమరినే యీ కార్యభారమును వహించ వలసి వలసినదిగా కోరియుంటిమి". - అని మరల ప్రజ కోరగా—

మహామంత్రి "అదియే చెప్పనుంటిని — అపర ధర్మావ తారులు, మహాకాళీ వుపాసకులు అయిన మాధవవర్మ మహారాజులే యిందుకు సమర్థులు.

ప్రజ కొంతవరకు శాంతించినది. ఎటులయిననూ, పుత్రుని యందుండు ప్రేమ తలయెత్తకుండునా - యని అనుకొని ఆనం దించి అంగీకారము తెల్పిరి.

యిటుల జరుగునని మాధవవర్మయూ తలచియుండ లేదు—ఏమిచేయుటకునూ తోచలేదు.—ఏమిచెప్పుటకునూ నోరురాలేదు. — తప్పనిసరిగా యాతడు న్యాయపీఠిపై యాసీనుడయ్యెను. మహామంత్రి యుండిననూ ఏదోవిధముగా తన నీయాపదనుండి గట్టెక్కింపగలడని యాశించిన మాధవ వర్మ నిస్పృహచెంది—తమకీ కార్యనిర్వహణ క్రొత్తగావున మహామంత్రులు, న్యాయవిచారణయందు, సలహాదారులుగా యుండవలయునని" కోరినాడు. మహామంత్రియూ యిక తప్పక, సలహాదారుడుగా నుండుట కంగీకరించెను. అభియో గము తెలుపవలసినదిగా కోరగా మహామంత్రి లేచినిలువబడి యుండెను.

ఆంధ్ర సామ్రాజ్యలక్ష్మియూ, ధర్మదేవతయూ వచ్చి నిల్చుండిరా యున్నట్లు ఆ సభయుండెను.

మహామంత్రి అభియోగము తెల్పుచూ, నూతనా శ్వము లాయత్తపరచబడిన రథమందు, తమ పట్టాభిషేక మహోత్సవ సందర్భమున ప్రజాదర్శనమునకై - ప్రజాశీస్సుల నందుటకై - యువరాజులు -

యింతలో పుత్రశోక పరితప్తులు, ఆర్థికశాఖా నుం త్రులూ అయిన ధనగుప్తులవారు లేచినిల్చుండి తీవ్రాక్షేపణ తెల్పిరి.

"నిందితుని గౌరవించుట—న్యాయవిచారణా విరు ద్ధము"—అని ఆగిపోయినారు.

"అవును — యిది పక్షపాతముగాయున్నది" అని స్కంధగుప్తులునూ ఆక్షేపణ తెలుపగా, వారి దెసగాంచి మహామంత్రి యిట్లు చెప్పెను.

"మాధవవర్మల న్యాయస్థానమున పక్షపాతమునకు తావేలేదు—ఎన్నడునూ యుండదు— అందులకీ సభయే ప్రబల నిదర్శనము"

"అందులకు మహారాజ మాధవవర్మలెప్పుడూ అభి వందనీయులే-కాని మహామంత్రులు అభియోగము నివేదించు టలో————

"ఆగిపోయారేం ధనగుప్తా — వార్ధక్యదోషము— నాయందేమయినా లోపములుండవచ్చును—"

"అనికాదు మహామంత్రీ—తమరు సర్వసమర్థులు—. అయిననూ నా అభిప్రాయము—

"మనవిచేయండి

"ఏమంత పెద్దవిషయముకాదు. నేరస్థులను గౌరవిం చుట, బిరుదుల నుపయోగించుట, న్యాయసభా గౌరవము

గాని, చట్టబద్ధముగాని కాదనియూ, మహామంత్రులు మరచి నట్లు తోచుచున్నది—

"తెలియక కాదు—

"మాధవవర్మల న్యాయస్థానము పరమపవిత్రమని ఎరుంగకనా"

"అని కాదు—

"మరి—

"అధికారులనూ, ప్రతినిధులనూ గౌరవించుట బుద్ధి మంతుల లక్షణము, మరియూ మన యాచారమునై యున్నవి. అదియునుగాక శిక్షింపబడువరకునూ అతనిని గౌరవించుట సభాసాంప్రదాయము, న్యాయసూత్రము, అని మీకు తెలి యని విషయముకాదు—వీరపూజ—జాతిగౌరవము యివి మహోన్నత మానవలక్షణములన్న విషయము—ఏమంటారు మహాకవీ—

మహాకవి దగ్గుపల్లి దుగ్గన్న అంచులకు, తమ మంజుల వాగ్విలాస వీరవిక్రమ పరాక్రమ క్రమ తేజ విరాజ విభాసుర, మధుర కవితాగాన గళమున, చిరునవ్వున "యదార్థము సెలవిచ్చారు" అన్నారు.

"కాని యిందు వీరపూజ ప్రసక్తి యేమియూ లేదు సరికదా–"మీరుచెప్పిన విషయములన్నియూ యదార్థములే. అయిననూ కేవల న్యాయశాస్త్ర పరిశీలనయే నా యుద్దే శ్యము. నేరము యేదికానిండు, నేరస్థుడెట్టి వాడవనిండు.

అట్టివారిని గౌరవించుటగాని, సభాపూజ్యత యొసంగుటగాని పనికిరాదనియూ, అట్టివిధవర్తన న్యాయశాస్త్ర విరుద్ధమనియూ మాత్రమే నా యాక్షేపణ—ఏమంటారు మహారాజా—అన్నారు ధనగుప్తులు.

మాధవవర్మ కలవరపడి ఏమియూ మాటాడలేక పోయినాడు. యిటుల సంభాషణవచ్చునని, అందుకు తను సమాధానము చెప్పవలయునని యాతడెంచియుండలేదు. వర్తమాన, భవిష్యత్ ఆంధ్రసామ్రాజ్య భవితవ్యాలను ఎంచలేక ఏర్పడిన జీవన్మరణసమస్య నుండొకదరిచేరలేక సతమత మవుతున్న యాతనికిది నిజముగా విఘాతమే—ఏమి చేయుటకునూ తోచక, మహామంత్రి అభిప్రాయమేమో, ముఖలక్షణములబట్టియే, తెలుసుకొను నుద్దేశ్యముతో, మంత్రి నవలోకించాడు. ఆ విషయాన్ని సూక్ష్మగ్రాహియైన ధనగుప్తులు బాగా గమనించారు.

"యిది అంత యాలోచింపవలసిన విషయమని నేను తలుచుటలేదు. గొప్ప విషయమూకాదు. కేవలము మహారాజుల నిశిత న్యాయదృష్టిపై ఆధారపడియున్న అతి సామాన్యవిషయము. కావున యిందుకై—అని ఆగిపోయి మరల అంతలోనే "యువరాజులకొక ప్రత్యేక న్యాయమును మాబోంట్లకొక ప్రత్యేక న్యాయము అయినపక్షమున—అని ఆగిపోయినారు.

మంత్రుల సభయంతయూ ఆశ్చర్యపడినది.

"అపర ధర్మావతారులు, నిరంతర న్యాయమూర్తులు మహారాజ మాధవవర్మల పాలననే శంకించుచుండిరా" అని రాయసము—

"దుర్గావరప్రసాది, కేవల మూర్తిమంత్వ ఏకాగ్రతా దృష్టిని యుక్తులై మహాంధ్రసామ్రాజ్య చక్రవర్తి నవమానించుటయూ—" అని దళవాయి చండసేనుడునూ,—

"కళాసరస్వతి కవమానమా" యని మహాకవియూ-

"మీరనినదే సత్యమయిన పక్షమున ఈ సభగాని, యిట్లు సమావేశమగుటగాని యుండదని, తమరింకనూ గ్రహించలేదా" యని స్థానాపతియూ, వరుసన ధనగుప్తుని ప్రశ్నించగా యప్పుడు, ధనగుప్తుడు మరల యిట్లని, తన వాదమును సమర్థించినాడు—

"మంత్రుల సభకునూ, తదితరులకునూ, నేవిన్నవించు కొనునది యొకటే—ఏమన, నా చెప్పిన విషయములో కేవల న్యాయశాస్త్ర మీమాంసయేగాని, పాలనా ప్రసక్తిగాని మరేవిధమైన యితరవిషయ ప్రశంసగాని లేవని సవినయముగా మనవిచేసుకొనుచున్నాను"—

అప్పుడు మహామంత్రి లేచి యిటుల ప్రశ్నించెను-

"తమ అభిప్రాయమును, సమగ్రంగా సెలవియ్యండి ధనగుప్తా"

ఈ విషయమున వివరించసంకల్పుడైన ధనగుప్తుని కంటె ముందుగా ప్రజాసభనాయకుడు, ధనగుప్తునుద్దేశించి—

"ఆర్యా, యిప్పుడు మా ప్రియతమ యువరాజులు, సామాన్యునివలె విచారింపబడవలయునని తమ అభిప్రాయమా'' ప్రశ్నించెను.

"అనికాదు-

"మరి—

"నేరస్థులెవరయిననూ వారిని గౌరవించుట తగదని''

"యువరాజుల విషయమున — అని మహామంత్రి సూటిగా యాతని ప్రశ్నించినాడు.

"ఎవరి విషయముననూ, నాకెట్టి ప్రత్యేక యుద్దేశ్యమునూ లేదు-అయిననూ అంతచిన్న విషయమునకు యింత యాలోచన ఎందులకు-''

"యిది చిన్నవిషయముగా ఎంచుచుండిరా- "అని స్థానాపతి మరల ప్రశ్నించెను-

"ఏమయిననూ కావచ్చును. అందేమియున్నది-పసుగు రాడు మాటవలె నలుగురి యభిప్రాయమెప్పుడునూ బలీయమైనదే—అయిననూ ఈ విషయము నొక్క-ధర్మాధికారులే సరిగా నిర్ణయించగలరు''-

యింతవరకును, కేవలము వీరి, వంకే చూచుచూ ఆలోచనా రహితుడై యున్న మాధవవర్మ యులిక్కిపడి, లేని గాంభీర్యమును తెచ్చిపెట్టుకొని మాట్లాడుట కుపక్రమించగా - ప్రజా సమూహమంతయూ యొక్క-పెట్టున, తమ

నాయకుని ఈ సభయందు నిందితుడా యనిపిల్చుటకు. ఎంత మాత్రము వీలులేదని గగ్గోలు చేయసాగిరి. ఎవరునూ అందుల కొప్పుకొనరయిరి. ధనగుప్తులకునూ ఈ విషయమై యంత పట్టింపులేదు. యువరాజులన్న యాతనికి తగనిప్రేమ - అయిననూ యిట్టి నేరమునకే, పుత్రుని పోగొట్టుకున్న యాతని హృదయము మొక్కవోయినది-ఈర్ష్య జనించినది.

నా విని మాధవవర్మ ప్రజలను నిశ్శబ్దముగా యుండ నలయునని మనవిచేసిననూ ప్రజ తమ అభిప్రాయములను గగ్గోలుగా వెలిపుచ్చుచునే యుండిరి. సభ నిశ్శబ్దమగుసరికి కొంతకాలము పట్టినది.

అపుడు మాధవవర్మ "నేరస్థుని గౌరవించుట న్యాయ శాస్త్రవిరుద్ధము" అని తమతీర్పు నిచ్చుసరికి, ప్రజలు నిశ్చేష్టులైరి - అంతవరకూ తలవాల్చియున్న ధనగుప్తుడు యొక్క సారి తలఎత్తి ఆశ్చర్యపోయినాడు - ఏమతని న్యాయదీక్ష-

యింతవరకునూ ఏవో ఆశలునింపుకుని, వేచియున్న ప్రజాహృదయముల కిదియొక ప్రథమతీవ్రతర గొడ్డలిపెట్టు - అయిననూ మాధవవర్మల న్యాయదీక్షయందు, శేష విషయములన్నియూ తృణప్రాయములే—మాధవవర్మ మహారాజు నకు జయము - అపర న్యాయపక్షపాదయూ జయతుని, తమ అసంతృప్తిహృదయములతో,విషాదకంఠములతోనే కీర్తించిరి. వారిని సద్దుచేయవలదని మహామంత్రి సంజ్ఞచేసి, మరల అభియోగమును వివరించుటకు సిద్ధమైనాడు. కాని యింత లోనే స్కంధగుప్తులు లేచి—

"అభియోగము చదివినను, చదువకపోయినను యొకటే కాని-అపరాధిలేకుండా విచారణ ఎట్లు" అడిగినారు.

అసలే నిస్పృహాహృదయులైయున్న ప్రజ ఈమాటతో కోపోద్రేకులయిరి - సభయని మరిచిపోయిరి. తమ ప్రభువు తమ యువరాజును అపరాధియనుట సహింపలేక - " యువరాజు అపరాధికాదు. యిది పొరపాటున జరిగినది - కావున వారిని యిచటకు రప్పించుటకు మేమంగీకరింపము-" అనిరి.

మాధవవర్మయు నిరుత్తరుడయ్యెను—"అటులే జరుగునుగాక" యనినాడు, తడియారిపోతున్న నాలుకను చప్పరిస్తూ—

"అటుల జరుగుటకు వీలులేదు" అని ఎదురుతిరిగినది ప్రజాసభ—

"అపరాధిలేని విచారణ న్యాయశాస్త్ర మంగీకరించదు-" అన్నారు మాధవవర్మ సూటిగా—

"అయినను సరే"

"న్యాయస్థానమని మరిచారా"

"క్షమించండి - ఏమయిననూసరే, మా నాయకుడు మాకు ముఖ్యం—కానిపక్షాన - మేమీసభనుంచి బయటకు నిష్క్రమించవలసివుంటుంది". అని ప్రజాసభ ఏకగ్రీవంగా అన్నది.

యింతలో యువరాజు విక్రమహేంద్రవర్మ యటకు

వచ్చాడు - విశాలవక్షముపై వరాహముద్ర, ప్రక్కన తీక్ష్ణకరవాలము దరహాసవదనము, చిరునగవు, సూటికళ్ళు, యాతని సహజమగు రాజఠీవితో అరుదెంచి, జయమాధవ వర్మ మహారాజా, అనినాడు అందరి దృష్టియునూ, అతని వయిపు మళ్ళినది - ఆశ్చర్యపడి రిత్తపోయినారు. ఏదయితే జరుగకూడదనుకొనినారో అదియే జరిగితీరినది. ప్రజాసభ మారుమాట్లాడ నవకాశము లేక యట్లే కూర్చుండిపోయినది-

---

# 14

అంతలోనే వృద్ధమాతయునూ ఆమె కోడలుయునూ ప్రవేశపెట్టబడిరి. వృద్ధమాత తనకుమారుని శవమును యొడిలో యుంచుకొని ప్రాడ్వివాక్క సభకెదురుగా కూర్చుండినది. ఆమె ప్రక్కనే ఆ యువతి దీనవదనయై తల వాల్చి నిలుచుండి పోయినది.

యువరాజు ప్రజవంకతిరిగి అభివాదము గావించినాడు. అతనిదుస్తులు పన్నీటి చిల్కరింపులతో నిండియుండుటవలన కాబోలు సభయంతయూ సుగంధము వ్యాపించినది. రేపు పట్టాభిషేకము – నేడు ధర్మాభిషేకమునకై తన రక్తమును ధారపోయనున్నాడు.

అపుడు ముఖ్యమంత్రిలేచి "యువరాజులు – అని ఆగి పోయినాడు – ధనగుప్తులు ఈసారి యడ్డుచెప్పలేదు. కారణము బహుశా యువరాజదర్శనముతో, హృదయమునందు, పుత్రప్రేమ చిల్కరించినది కాబోలు – అయినను యువరాజులే అడ్డుతగిలి" తానిక్కడ యువరాజును కాదనియూ, అపరాధిననియూ, చెప్పగా అంతవరకూ అట్టిదానిని వాంఛింపని వారందరునూ రిక్తపోయిరి–

మాధవవర్మ వక్షము వుప్పొంగిపోయినది.

మహామంత్రి అభియోగమును వివరింపదొడగెను.

"అపరాధి, స్వయముగా సారథ్యముచేయుచూ పుర వాహ్యాళికని చనిన సమయాన, విపణివీధి సమీపమున, యాతని రథము ఒకయువకుని మరణమునకు కారభూతమయి నది. యిదియే నేటి అభియోగము" అని కూర్చుండెను.

అప్పుడు న్యాయగంటా నినాదకుడు యువరాజును న్యాయవాది సమక్షమునకు రావలసినదని చెప్పగా - యువ రాజునూ న్యాయసభకెదురుగా నిలుచుండి, "న్యాయపక్ష మున, ధర్మపక్షమున మాధవవర్మల న్యాయస్థానము పవి త్రముగాఎంచి, వారి ధర్మ, న్యాయనిర్ణయములు తనకు శిరోధార్యములని తలంచి, మహాంధ్ర సామ్రాజ్యమాతను కొలిచి, అమ్మలగన్నయమ్మ దుర్గమ్మయాన, సత్యమునే చెప్పెదు; నని కరవాలముపై చేయుంచి ప్రమాణము గావించెను.

మాధవవర్మ యువరాజువంక చూచెను. అతనిలో పుత్రప్రేమ తొంగిచూచినది. యిదిగమనించి యువరాజు "జయన్యాయరక్షాదక్షా జయమనినాడు - మాధవవర్మ, తన పుత్రునియందు ధర్మదేవతను గాంచినాడు.

"నిందితుడా - అని పిలచి యాగినాడు - యింకే మియూ మాటలుగా యతనినోటినుంచి వెలువడలేదు -

"జయము న్యాయమూర్తులకు—

మాధవవర్మ మరల తమాయించుకొనినాడు- "నింద తుడా - అభియోగమును వినియుంటివి-

"చిత్తము - "

"నేరారోపణపై నీ అభిప్రాయమేమి" అని ప్రశ్నించగా యువరాజు

"న్యాయాధికారీ - పవిత్రతమూర్తీభవించిన న్యాయస్థానమా - అపరాధమునుగూర్చి ప్రత్యేకతవహించి మాకెట్టి యుద్దేశ్యములుగాని లేవు, న్యాయమూర్తుల నిర్ణయము మాకు శిరోధార్యము"

"అయివుండవచ్చును గాని, వాఙ్మూలము అవసరము" అని న్యాయసభ అనినది.

"ప్రత్యేకముగా మేమేమియూ చెప్పదలచుకొనలేదు. అయిననూ న్యాయసభకోరినది కావున చెప్పవలసివచ్చినది. ఈ జరిగిన యుదంతము కేవలము తెలియక జరిగినది." అని యువరాజులు తాము బయలుదేరినది మొదలు న్యాయసభ కరుదెంచువరకును వివరముగాచెప్పి. "అశ్వములు బెదరుటకు కేవలము అవి క్రొత్తవి శిక్షణలేనివి యనుకొనుటకు వీలు లేదు. ఏలనన మేము సమర్థనీయమగు సారథ్యమున పయనించి యుంటిమి - అందులకు ప్రబలమగు సాక్ష్యమున్నది. - లేని ఎడల అనగా మాకు సారథ్యము చాతకానిఎడల యిట్టి యొడిదుడుకు ప్రారంభముననే సంభవించి యుండెడిది. కావున అశ్వములు బెదరుటకుగల కారణమొక్కటియే - ప్రజ హర్ష నాదములే - సహజముగా శిక్షణలేనివగు ఆ అశ్వములు బెదరినవి. అశ్వములను అదుపుననుంచు యుద్యోగములో యితర

విషయములను గమనించలేకపోతిని - పలదనిన అశ్వశిక్షకుని అభిప్రాయమును కాదనుటయూ తదుపరి ఈ సంఘటనయూ జరిగినది. ఏదిఏమయిననూ, జయజయధ్వాన నియుక్తులైన ప్రజవలన యిది జరిగినదని మేమనుకొనుచున్నాము.'' అని యువరాజులు ఆ చనిపోయిన యువకుని భార్యవంక చూచిరి. ఆమెయు జాలిగా యితనివంక చూచినది. యువరాజులా అబలానిశిత దృష్టినుంచి తప్పించుకొనుటకు ప్రక్కకుతిప్పిరి.

*　　*　　*　　*

యువరాజు వాఙ్మూలము పూర్తయినది - వెంటనే స్కాంధగుప్తులు ''ప్రజానింద'' యనినాడు.

''బాధ్యతలు నిర్వర్తించలేని వారెవ్వరయిననూసరే వారిని నిందించి యికముందట్టి తప్పుచేయక సరియగు మార్గమున నుంచుటకు ప్రతివానికి బాధ్యతయున్నది. యిందు ఎవరి యాక్షేపణయూ అవసరములేదు. కేవలము యనవసరము- యిక మా విషయము - యింతవరకూ నేరముసంగతి మాకు తెలియదు - ఆ మరణించిన యువకుని శవమునయిననూ యింతవరకూ దర్శించియుండలేదు. అయిననూ ఏనొక మహాశక్తి మూర్తిమంత్వ ఏకాగ్రతాదృష్టి నియుక్తులు, అపర ధర్మావతారులూ అయిన ఒక మాననీయుని అనుంగు పుత్రుడను. యిది మా గౌరవము. యిట్టిదే జరిగి చరిత్ర కాదర్శప్రాయము కావలయునని మా కోరిక - నేరము మావలన జరిగిననూ జరుగకపోయిననూ, మాపైననే నేరమారోపింపబడినది. కావున మేము విచారింపబడుట అత్యావశ్యకము,

అత్యవసరమునూ ధర్మపక్షమూనై యున్నవి. మమతలకు తావీ యక, బాంధవ్యము తలచక, పవిత్రాంధ్ర సామ్రాజ్య ధర్మ మూర్తి యిందులకే శిక్షవిధించిననూ మాకంగీకారమే – కాని, పరాక్రమవంతులుగా, వదాన్యులుగా, యువరాజులుగా ప్రజాహృదయ ఫలకములపై వోగాడుచున్న మేమిట్లు దోషిగా నిలువలేము కావున శలవుయివ్వవలసినదని కోరగా న్యాయ సంఘం ఆవిధవర్తనకు అనుమతించింది. యువరాజులు మరల నొకసారి సభకభివాదం గావించి వెడలిపోయినాడు.

న్యాయసంఘం "అపరాధి తమనేరము నంగీకరించి న్యాయసంఘమువారిని గౌరవించి, వారియాజ్ఞ శిరసావహిం చెదనని ప్రతినచేయుటవలన, ప్రధానసాక్ష్యులగు అశ్వశిక్షకుని అంగరక్షకుని, పరిత్యజించుట జరిగినది – యిక ఫిర్యాదిని విచారింపవలయును."

కాని వృద్ధమాత, పుత్రశోకభరమ్మున తానేమియూ చెప్పలేననియూ, అన్నిటికీ ఈ శవమే తార్కాణమనియూ, వాకొని, మరల ఆ శవముపైబడినది – యువతి న్యాయాధి కారుల నిర్ణయమములు జరుగవలయునని చెప్పినది.

అంత మాధవవర్మనుద్దేశించి "అభియోగము చదు వుటయునూ, యిరుపక్షములవారి వాఙ్మూలములనూ వినియుం టిరి. యిక అభిప్రాయసేకరణ జరుగవలసియున్నది. ప్రతి వారునూ తమతమ అభిప్రాయములను నిస్సంశయముగా వెలిబుచ్చవచ్చును." పలుకగా ప్రథమముగా బుద్ధిమంతుల సభ యిట్లు తమ అభిప్రాయమును చెప్పసాగినది.

*　　*　　*　　*

యిందు న్యాయాన్యాయములు విచారించుటగాని, నేరమెట్లు జరిగినదనిగా యోచించ నవసరమేమియూ లేదు. అదియునుగాక, నేరస్థులైన యువరాజులు మహాపరాక్రమవంతులు - మేళరసుబిదు దాంకితులు - శత్రుగుండెలగాలము- ఆంధ్రసామ్రాజ్యమునకు వెన్నెముక - యుక్తాయుక్త విచక్షణాజ్ఞాన శిక్షితులు - అందునవారు క్షమార్హులు - "యిది మా ఏకగ్రీవనిర్ణయము." అని చెప్పగా - ప్రజ యొక్క-సారి హర్ష ధ్వానములు గావించిరి. న్యాయస్థానలేఖకుడు ఈ విషయ మంతయూ వ్రాసికొనెను.

అనంతరము ప్రజాసభ తమ ఏకగ్రీవాభిప్రాయమునిట్లు తెలియచేసిరి. "యువరాజులు బుద్ధికుశలురు. అవిరళ దాతృత్వము విశేషప్రజ్ఞయు వారి సహజలక్షణములు. అట్టివారిని విచారింపబూనుటయే తగనిపని - అయిననూ పరమపవిత్ర ధర్మదేవతామూర్తిభవ తెలుగు న్యాయస్థానముగనుకను, మహాప్రభువులు దుర్గాఉపాసకులూనగు మాధవవర్మలు న్యాయమార్తులు, కావుననే, యిట్టికార్యము నిర్వహింపగల్గినారు. అయిననూ, చనిపోయిన యువకునకూ వీరికి ఎట్టివిధసంబంధ, అనుబంధ, బంధములుగాని, వ్యతిరేకతగాని లేవు. అయిననూ యువకునిమరణమునకు యువరాజులు బాధ్యులుకావలసి వచ్చినది. మాకెంతయూ దుఃఖకరమగు విషయమిది - కేవలము కాలమహిమగనే మేము ఈ సంఘటనను పరిగణించుచున్నాము. అజాగ్రత్తగ, మార్గమధ్యమున

నిల్చునియుండువారికిగాని, మార్గమున అటుయిటూ దోగాడు వారికిగాని, అజాగ్రత్తగావర్తించువారికిగాని, ప్రమాదములు జరుగకపోవు-కాని అది వారిబాధ్యతే- అది నేరముకానేరదు. అయిననూ యువరాజులవారిని, సామాన్యునిగా విచారించుట యునూ జరిగినది. - యువకుడు మరణమందుటకు కారణ భూత మెవరయిననూ గావచ్చును - కాని యువరాజులు నేరస్థులుకారు - అయిననూ యిదియొక దుస్సంఘటన - కావున వృద్ధురాలికి. ఆ యువతికి సానుభూతి తెల్పుచు న్నాము - యింకొక విషయము. ఆ వృద్ధురాలు జీవించి యున్నంతకాలమూ జీవనభృతియూ అంగీకారమైన పక్ష మున యువతికి, అనులోమ వివాహముల నేర్పాటుచేయుట మా యుద్దేశ్యము'' అని ముగించినారు. ఈ విషయమునూ న్యాయసభాలేఖకుడు లిఖించినాడు.

తదుపరి మంత్రులసభ - ఏకగ్రీవనిర్ణయముగాదు. ఒక నిద్దరుతక్క శేషించినవారందరూ మౌనముగనే యుండిరి.

''యిది, యువరాజుల పొరపాటుననూ, బాధ్యత తెలి యక చిందులుత్రొక్కుతున్న ప్రజవలననూ జరిగినది'' అని స్థానాపతియూ -

''కావున ఈ విషయమున నేరమొకరిపైనుంచి శిక్షిం చుట న్యాయశాస్త్రరీత్యా తగదని'' - రాయసమునూ -

''యువరాజులు నిర్దోషి'' అని మహాకవియూ -

''ఎట్టి పరిస్థితులలోనూ యువరాజులు శిక్షింపబడుటకు

వీలులేదు'' అని చండసేనుడునూ, తమతమ మనములకు తోచినవిధముగా వారి అభిప్రాయములను మనవిచేసికొనిరి - అంత ధనగుప్తుడు మరలలేచి'' మహారాజా - ''ఆగిపోయి నాడు - మరల ఏమితెచ్చిపెట్టనున్నాడోయని ప్రజా యాందోళనా హృదయులైరి.

''ధనగుప్తులు తమ యభిప్రాయమును నిస్సంశయముగా తెలియపరచవచ్చును - అన్నారు మాధవవర్మ -

''చిత్తము. ఒక్క సందేహము - ''

''ఏమది -

తెలిసిచేసిననూ తెలియక చేసిననూ నేరము మారదు కదా - ''

''అవును''

''అపుడు నేరపర్యవసాన మొక్కటియేకదా - ''

''అందులకు సందేహమెందులకు - ''

''నేరస్థుడు ఎవరయిననూ, యాతనిపొరపాటుననే, నిక్కముగా మరణము సంఘటితమైననూ, శిక్షింపబడుట న్యాయపక్షముకదాయని నాఅనుమానము' అని కూర్చుండిరి.

అంత సమాధానముగా మహామంత్రి శివశర్మ నిలుచుండి, ''యిది కేవల మభిప్రాయసేకరణయేకాని, తీర్పు కాదని సభాసదులు మరచినట్లు తోచుచున్నది - మాధవవర్మంరాజ్యాన వాక్సభా స్వాతంత్ర్యములు కలవని, అభిప్రా

యము లెవరైననూ ఎట్టిననూ సభాముఖమున బహిర్గతపరచ వచ్చునని మరచినారు. అదియునుగాక యిది న్యాయసభ - యిపుడభిప్రాయసేకరణ జరుగుచున్నది - అభిప్రాయమ్ముల వ్యాఖ్యానించుట క్షమించరాని మహానేరము. యిది యొక భయంకర విషమసంధిగ్ధావస్థ - భయంకర కాళనాగులు, తమ విషమునుగ్రక్కుటకు యత్నించుచున్న దారుణ సమయమిది. న్యాయసూత్రముల నెవ్వరూ గమనించుటలేదు- ఈ నేరమున యువరాజుల పొరబాటెంతయో, యువకుని అజాగ్రత్తయూ అంతియే - ఈ రెండువిషయములూ ఈ నేర మున సమానస్థాయి వహించియున్నవి. యువరాజులు గమనించకపోవుట, యువకుడు అజాగరూకుడై వర్తించుట - జనసమ్మర్ధము - ప్రజల జయజయధ్వానములు - వారి క్రమ శిక్షణారాహిత్యము, - విపణివీధియందు సమ్మర్ధమెక్కువగా యుండు సమయాన ప్రజాదర్శనమునకై బంపుట - అశ్వ శిక్షకుడు కొత్తగుర్రముల నాయత్తపరచుట - అంగరక్షకులు వెన్నంటకపోవుట - యివిఅన్నియూ ఈ నేరవిచారణయందు అంతర్గతమైయున్న నేరములు - అయిననూ యువరాజులు న్యాయమూర్తులు కావున ఈ విషయనిర్ణయమును, సభకే అప్పగించిరి. యిన్నినేరములకు యిపుడొకవ్యక్తి బలియగు టయూ, - యిన్నినేరములకు యొకవ్యక్తి సమాధాన మొసం గుటయూ - యిది న్యాయవిరుద్ధము - అట్లయిన పక్షమున అనగా యిది న్యాయసమ్మతమే యనినఎడల పై నేరము లన్నియూ యొకటొకటిగా విచారింపబడవలయును. కావున,

ప్రజాసభవారి యుద్దేశ్యము యుక్తియుక్తముగానూ సమంజసముగానూ యున్నది."

"యుద్దేశ్యములుండవచ్చును - కాని యిచట వలయునది మాత్రము కేవలన్యాయశాస్త్ర పరిశీలనమే -" అని ధనగుప్తుడనెను.

"అట్లయిన న్యాయశాస్త్రపరిశీలన గావించెదముగాక - పైననే యొసంగితినిగా -" అన్నారు మహామంత్రి -

"అవన్నియూ నేరములు కావచ్చును - నిక్కముగా నేరములే - కాని న్యాయసభదృష్టికి తేబడిన దొక్క యువకుని మరణయుదంతము మాత్రమే -"

"అవును - సరియే ఆవిషయమే చర్చింతము. మన న్యాయశాస్త్రములోని ప్రధానాంశము తమకు తెలియును కదా"

"తెలియకేమి - హత్యకు ప్రతి హత్యయేగా మన న్యాయము"

"అవును - అయిననూ, ఫిర్యాది నేరము నుపసంహరించుటగాని, నేరస్థుని క్షమియించుటగాని జరిగిన—"

"నేరము శిక్షార్హముగాదు" అని స్థానాపతియనిరి.

అపుడు మహామంత్రి ఈ విషయమై గమనింపవలయు

నని, న్యాయసంఘమువారివంకచూడగా, వారునూ యుక్తమనియూ, అందుల కనుజ్ఞనొసంగుచున్నామనియూ చెప్పిరి - చేరినప్రజ కొంతవరకూ శాంతించినది - ఏమి

జరుగునాయని యాతృతతో వారుండిరి" - కాని మాధవ వర్మలు ముందుగనే న్యాయసంఘాభిప్రాయము తెలుపమని కోరగా, వారిట్లు తెలియపరచిరి - "యువరాజులు ధర్మ మూర్తులు. ఆంధ్రుల మకుటాయమానమగు, సకలమణిమయ రత్నస్థగితకిరీటము, రేపటిదినము వారి నలంకరింపనున్నది - రేపటిదినము వారి పట్టాభిషేకము—"

"న్యాయశాస్త్రముమార్చుట అవివేకము - యువరాజులకొరకు న్యాయశాస్త్రము మారదు" అన్నారు మాధవ వర్మ -

"అవునంతియే మహారాజా" అని ధనగుప్తులనినారు.

యింతలో ఏదిక్కునుండియో మెల్లగా "అశ్వములనే అదుపులోనుంచలేని యువరాజు, రేపటి ఆంధ్రసామ్రాజ్య భారమునెట్లు మోపగలడు" అను మాటలు వినవచ్చినవి కాని, ఎవరనినారో ఏరికినీ తెలియదు.—

అపుడు న్యాయసంఘము "యిది మా యుద్దేశ్యము మాత్రమే మహామంత్రులవాదన సమంజసముగాయున్నది మేము బలపరచుచున్నాము - "

"కాని - అని ఆగిపోయినారు మాధవవర్మ -

"న్యాయాధికారు లభిప్రాయము, శిరోధార్యము, నిరంకుశము, కానిపక్షమున - "

"అటులెన్నటికినీ జరుగదు - న్యాయమూర్తి యభిప్రాయమెప్పుడునూ న్యాయసంఘముతో నేకీభవించును."

"అట్లయిన ఏకాభిప్రాయులను, న్యాయాధికారులమూ అయిన మా నిర్ణయము ధర్మపక్షము, న్యాయసమ్మతము. సర్వమత శిరోధార్యము. యువరాజును దోషిగానిర్ణయించుట గాని, నిర్దోషిగా ప్రకటించుటగాని మా యభిమతముగాదు. అందుననూ రెుుకమార్గము, మంత్రులుచెప్పినది సమంజస ముగాయున్నది. కావున ఫిర్యాది క్షమించినపక్షమున, ఫిర్యాది నిరపరాధి కాగలడు"

"పక్షపాతమా-అన్నారు నగరవైశ్యాధిపతి స్కాంధ గుప్తులు -

"కాదు. యిది న్యాయశాస్త్రమును తరచి విషయ సేకరణ జరుపుట -

అందరూ తమతమ అమూల్యాభిప్రాయము లొసగి యున్నారు -

న్యాయసంఘమున యితరులకెవ్వరికినీ స్థానములేదు -

కేవల అభిప్రాయప్రకటనా ప్రతిపత్తితప్ప యింకితర ముగు ప్రతిపత్తులు ఎవరికినీలేవు.—అని తీవ్రముగా హెచ్చ రించుచున్నాము - మహారాజా యిదే మా నిర్ణయము"-

"మీ యుద్దేశ్యములతో ఏకీభవించి అందుల కనుమ తించుచున్నాను. ఫిర్యాదిక్షమించిన నేరస్థుడు క్షమింపబడ గలడు"

మరల అందరి హృదయములయందును ఆశాంకుర ములు మొలకలెత్తినవి —వృద్ధమంత్రి తదితర మంత్రులు న్యాయసంఘం, వృద్ధమాతచుట్టునూ చేరిరి.

# 15

"అమ్మా బిడ్డలగన్నతల్లివి—పుత్రశోకముతో పరితపించుచున్న నీవు కొంతశాంతించి, పరిస్థితిని గమనించుమమ్మా" యని పరిపరివిధముల యామెను ప్రార్థించిరి కాని యామె వీరివంకచూడనేలేదు. అప్పుడు మహామంత్రి ఆమె వంకచూస్తూ—"అమ్మా - యిది కేవలము యొకరికి సంబంధించినదికాదు. ఈ న్యాయసభా నిర్ణయముపైననే యావదాంధ్రుల భవితవ్యం ఆధారపడియున్నాయి. పుత్రశోకమున పరితప్తమయినదానవు - పుత్రశోకమన నేమియో నీకు తెలియును. పవిత్రాంధ్రసామ్రాజ్య అధినేతలు, మనలను కన్న తండ్రిగా పాలించు మాధవవర్మలకు, తెలుగుతల్లికి తీరని పుత్రశోకమును ప్రసాదించకమ్మా—అని ఎన్నియోవిధములుగా ప్రాధేయపడినాడు కాని ఆమెకదలలేదు - మెదలలేదు. అంత ఆ ప్రక్కనేనిల్చున్న యువతివంకచూసి 'తల్లీ' నీవయినా చెప్పవమ్మా-ధైర్యమువహించి, ఆంధ్రసామ్రాజ్యాన్ని అనాధను కానీయకమ్మా - అని అనగా ఆ యువతియూ ఆమెను కదల్చప్రయత్నించెను-తనచేతి నామెభుజముపై యుంచెను- ఆమెచేతికి చల్లగాతగిలెను - ఒక కెవ్వనకేక యామెనోటి నుండి వెడలినది - వృద్ధమాత మరణించినది-ఆమెచెంపలపై యింకనూ కన్నీటిచారలు అల్లేయుండినవి.—అందరునూ, ఏవో ఆశలుంచుకునివచ్చి ఈదృశ్యముగాంచి, నిశ్చేష్టిత హృదయులైరి.

అప్పుడు మాధవవర్మ "యువరాజుల రథము యువ రాజుని యజాగ్రత్తవలన యొకని మరణమునకు కారణభూత మగుటయేగాక, యీనేరము మరొకరి మరణమునకు కారణ మయినది. యిప్పుడు యువరాజులు రెండు నేరములకు బాధ్యు డయినాడు."

"వద్దు మహారాజా—" అన్నది యువతి - అందరి దృష్టులు ఆమెవంకమరలినవి "మహారాజా - ఆగండి. మీ న్యాయదీక్ష ఎరుంగనిదికాదు. యువరాజుల పొరపాటువలన ఈ పొరపాటు జరిగినదనుటకంటె నా పుణ్యఫలమంతియే యనుకొనుట ఎంతయూ సమంజసము–కావున యువరాజులను నిర్దోషులుగా ప్రకటింపుడు.

"నేరస్థుడు నిర్దోషి ఎన్నడూ కాజాలడు"

"అట్లనకండి మహారాజా–నన్నుచూడండి–నావలెనే యింకొక అమాయికస్త్రీ, భవిష్యదాంధ్ర సామ్రాజ్య చక్ర వర్తిని, నిరంతరశోకమూర్తియగుట నేను సహింపలేను. నేను యువరాజులను క్షమించుచున్నాను"

"క్షమాపణ–యువరాజులను క్షమించుటయూ–ఆఅర్హత ఎవరికినీలేదు. నా ప్రియపుత్రుడు, మేళరసుబిరుదాంకితుడు క్షమాపణవేడుకొనుటగాని, క్షమింపబడుటగాని మేము చూడ లేము. ఆతనిదృష్టికిరానని యొకనేరము యాతనిజుట్టుకొనినది– అంతియె–అతడు నేరస్థుడైనాడు. ఫిర్యాది వృద్ధురాలు–పుత్ర శోక పరితప్త హృదయయై నేడు మరణించినది. యిప్పుడు ధర్మదేవతా ప్రకటన చదువవలసియున్నది. అందులకు

ధర్మదేవతా పక్షమున మా నిర్ణయమును తెల్పుచున్నాము. "యువరాజుల రథముయొక్క యువకుని మరణమునను కారణ మయినది. సారథ్యము యువరాజులే చేయుచుండిరి. అజాగ్రత్త, పొరపాటు అనుటకు వీలులేదు. ఆ విషయములు యిచట చర్చింప నవసరములేదు. ఆ యువకుని మరణము చింతించుచూ ముదుసలి మరణించుటకునూ దారితీసినవి. వీటికిఅన్నివిధములా యువరాజులేబాధ్యులు-అందునశిక్షయూ అదేవిధమున జరుగును. ప్రజకు కన్నతండ్రిలాంటి యువరాజు తనతండ్రిచేతిలోనే మరణించవలయును. "చదువుట పూర్తి అయినది. సభయంతటా విషాధచ్ఛాయ అలముకొనినవి.

వెంటనే మాధవవర్మ యాసనమునుండి దిగ్గునలేచి అభ్యంతర మందిరమునకు చరచరా సాగిపోయెను. ఆతని ఎద పగిలిపోయి ద్రవీభూతమయినది. అభ్యంతర మందిరమున యొక చలువరాతి వేదికపై, తలవాల్చి విచారభరమున గూర్చుండి యుండెను.

---

# 16

అతడక్కడెంతసేపు కూర్చుండెనో ఎవరికినీ తెలియదు. ఆనందోత్సవంలో విషాద చరమాంకం, ఎవ్వరూహించగలరు. మానవులు తమకు లభించిన ఆనందముగాని, విచారముగాని ఓపలేరనుటకు యిదియే ప్రబల నిదర్శనము.

యింతలో అడుగుల సవ్వడయ్యెను. మాధవవర్మ తల ఎత్తి తన దృష్టిని ద్వారమువైపునకు సారించినాడు ఏది జరుగ కూడదని ఎంచినాడో మరల నదియే జరిగి యాతని నిశ్చేష్టు నిగావించినది.

ఆ వచ్చినది కాకతి రాకుమారి - యువరాజుల అనుంగు చెలి- విశ్వదృశ్యరమణీయ మామె వదనము- అట్టి యాపె వదనము ముడుచుకొని యున్న శోభలేని తామర పూవువలె యుండెను.

ఆమూర్తీభవ శోకమూర్తిని చూడలేక మాధవవర్మ తల వాల్చుకొని నాడు- అంతకంటె యతడేమి చేయగలడు, నిరంతరం న్యాయదృష్టియే యలవరచుకుని తన వార్ధక్యము వరకునూ ఎట్టి ఒడుదుడుకలూ లేకవచ్చిన యాతని జీవితమున కిది యొక గొడ్డలిపెట్టై తీవ్రముగా బాధించినది.

మహారాజా ''అన్నది. వాడికొనిపోయిన ఆమె విషాద గాత్రము నుండి వెలువడినట్లున్నది.

మాధవవర్మ ఆమెవంక తలెత్తి చూసెను. కాని బెదురుగా జాలిగాయున్న ఆమె దృష్టిని గాంచలేక తల ప్రక్కకు తిప్పుకొని నాడు.

"పరాక్రవంతులని విని, అభ్యుదయ కాముకులని ఆశించి, న్యాయమూర్తులని ప్రేమించి - ఆగిపోయినది.—

"యువరాణీ - అన్నాడు మాధవవర్మ-

"కాదు ప్రభూ - మరుక్షణములో ఒక వృత్తముని పోగొట్టుకొన నున్న అభాగినిని-

"వుద్వేగము చెందకు రాకుమారీ -

"కాక యింకేమున్నది. - ప్రభూ యోచించండి - ఏను దీర్ఘసుమంగళిని కారాదా - ప్రభూ - మాంగల్యము నరకే నోచుకున్న అభాగినిని చేయదలిచారానన్ను-సత్సంతానము జాతికి జీవగర్రయని యంచుల కారాధనీయులు స్త్రీలని మాతృమూర్తిగా దేశసేవా కాముకురాలిగా మీరు చేయించిన ప్రమాణములన్నియూ ఏమయ్యాయి ప్రభూ - మాననీయులు అపరధర్మావతారులు, నాకు పతిభిక్ష పెట్టండి. మహారాజా - వదాన్యతమూర్తీభవించిన దానకర్ణులు నాకా దానాన్ని ప్రసాదించండి మహారాజా" అని వస్తూవున్న దుఃఖాన్ని, చిగురుటాకు పెదవులపై యాపుకొనుచు అన్న ఆమె మాటలు వినలేక, విని ఆ శోకాన్ని దాచుకొనలేక అతని ఎదచలించిపోయినది. త్వరత్వరగా అటనుండి తన విశ్రాంతి మందిరమున కతిశోకభరమ్మున వెడలి పోయెను.

# 17

అట్లు మాధవవర్మలు చనుటలో. యావదాంధ్రులు తల మానికముగా గొల్చు, నవరత్న ఖచిత స్వర్ణ ప్రభ మకుటము, తమ వుత్తమాంగమున ధరించి, యావదాంధ్ర మహాసామ్రాజ్యమును పరిపాలించు అవిరళదాతృమూర్తి, సాహసస్వ నిర్వాక పరాక్రమ క్రమ తేజవిరాజ భోజుడూ, మేళరసు బిరుదాంకితుడు అయిన యువరాజు విక్రమహేంద్ర వర్మల అనుంగు చెలి, ప్రియతమభార్య, ప్రేమించి సర్వము అతని కర్పించిన యుబల, కాకతి రాకుమారి వదన చంద్ర బింబము, మాధవవర్మ అట్లు వడిగా చనుటలో, యువరాజుల యూరువులపై యుండవలసిన తల యిలా తలమును తాకి శోకాతి వేదనలో శిరమెత్తలేక యట్లే దుఃఖించుచున్న యువరాణి ముక్తమాలాదేవిని గాంచిన, పుత్రుని పోగొట్టు కొనుట యిష్టతలేక భూదేవి రోదించుచుండె నా యన్పించు చుండెను.

యింతలో, రుధిరములేక పాలిపోయిన ముఖముతో యువరాజట కరుదెంచెను. - యునరాణి తలపై దక్షిణ హస్తమునుంచెను. ఆమెయూ శోకాతి భరమున అతని హృదయముపై వ్రాలిపోయెను. అటునుండి నెమ్మదిగా లతాని కుంజముల వయిపు జని యచట ఉపావేదికపై యుపవిష్టు లయిరి. రాగారుణిత నేత్రుడై తదేక దీక్షతో గాంచి, ఏదో

అనిర్వచనీయానందానుభూతి నందవలసిన యువరాజ దంప తులు ఖిన్నులై విషణ్ణులై, ఒండొరుల వీడలేక మాటాడుకొన లేక, మధ్య మధ్య నొకరి నొకరు చూచుకొనుచు హృద యములతోనే సంభాషణలు సల్పుకొనుచుండిరి. అప్పుడు యువరాణి విచారమున పూడికొన్న స్వరముతో –

"వినీల భీకరపాండుర జ్వాలలతో కలశాంబుధి నుద యించిన హాలాహలమును పరమశివుడు మ్రింగి, జగజ్జీవిత మును జగజ్జేయామానము గాంచినాడు.—"

"అందులకు సందేహ మెందులకు"

"అటులనే కోర్కెల నరికట్టుటకై ముద్దియను విష్ణువు చేపట్టినాడు—కాని ముక్కోటిదేవతలకు రాహుకేతువులకు కూడా ఆహారమై, మునిశాపాహుతుడయినను, చంద్రుడు మాత్రము నాశముగాక లోకమును బాధించుచున్నాడు.

"పరదూషణ అంతశుభమ్ము కాదేమో—"

"కాదు-ఆహారమునకై మొగమువాచిన రాహుకే తువులయినను, కనీసము ఈదినముమింగి హృదయతాప బాధనుపశమింపచేసి, విశ్రాంతినివ్వవలదా ప్రభూ–

"విశ్రాంతినందుము –

"విశ్రాంతి-ఎరికి-జీవనరణరంగమున, కర్మయను సుడి గుండమున. దిర్ధిరమహావేగమున ద్రిప్పివేయబడుచున్నాను. ఒకవంక ప్రశాంతము ప్రఫుల్లము శీతలవాయుపూరితమగు వెన్నెల మరియొకవంక గాఢతమోజలధినుండి వెడలివచ్చు అజ్ఞానాంధకారము –

"వుద్విగ్నతఎందుకు రాకుమారీ-క్షత్రియులకు ధర్మ రక్షణార్థము మరణనుండుట సంతోషదాయకము వీర ధర్మమూ అని ఎరుంగవా -

"కాదు. ప్రశాంతరాజ్యాన శాంతిలేక క్రాంతి వెల్లి విరియ -

"ఆవేదన"

"కాక యింకేమిమిగులును ప్రభూ-ప్రశాంతి నిలయ మున-

"అవును దేవీ-ఉద్వేగము, ఉద్రేకములకలవడిన క్షత్రియ రాకుమారుడు, ప్రశాంతినిలయమునకు రాగలడా-వచ్చిన మనస్సంధానము నందగలడా"

"తప్పక"

"కాదు, కానేరదు. కలవరపడి మనోవైకల్యము నంద కుము.

"ప్రభూ -" యింతలో హృదయకుహరమునుండి యొక విషాదతరంగము ఆ మొగళమును పూడ్చివేసెను" మన జీవితాలకిక ప్రశాంతిలభించును, అని యింకేమియు మాటాడ నేరక యతని హృదయకుహరముపై వాలిపోయెను. అంత వరకు పెట్టుకున్న గాంభీర్యము వైదొలగి, అతనిని దుఃఖ సముద్రమునకు నెట్టెను. పవిత్రాంధ్ర సామ్రాజ్యాధినేత, యువరాణి ప్రేమసామ్రాజ్య రాజ్ఞీత్వాస్వాది తెలియక చేసిన యొకపొరపాటునకు, మారణహోమమున సమిధ కానున్నాడు.

రణరంగమున కోటిసూర్యప్రభాసయుక్త శౌర్యగభీరవదనము అగ్నిహోత్రమునబడి విలపించుట – ఏమాతనితండ్రి ధర్మనిరతి !

యింతలో యువరాణికదలికచే, విముక్తుడాయెనా అన్నట్లు నిట్టూర్పువిడిచెను. అతనివక్షము తడిసిముద్దాయెను. కుంకుమరేఖలు కరగిపోవు వలన రుధిరమువలె కాన్పట్టుచూ అతని ఎర్రదనమునకు పొంగెనాయన్నట్లుండెను. ప్రసన్న వదనమున ప్రశాంతచ్ఛాయ – లేతగులాబీ చెక్కిళ్ళపాల్గారు, నవనవోన్మేష నూత్నజిగీష, నిరంతర మధుర జలజాధర మృదుపెదవులు నేడేలకో తడియారి, యాము యనివార్య శోకప్రవాహానికి తలయొగ్గినవా యన్నట్లుండెను. కొప్పున తురుముకొన్న సుమబాలలు, తమవిభునికానక, వెదకుచూ, కదలికదలి పరికించుచున్నవా యనునట్లు, వాడి చల్లనిగాలికి అటునిటు కదలుచుండెను. మధుమూర్తి మంత్రవిలాసము, వికాసమైయొప్పు మలయకుమారుడు గిలిగింతల పుష్పొడి దుమారమును, తన చక్కటి చల్లనిగాలిలో లీనమొనర్చుకొని నేరుగా వారిహృదయములనే తాకుచుండెను. ఆ తాకిడికి వారి శోకభరితహృదయములు భయమంది మరింతదగ్గరయి, యొకటియై చాలకాలమట్లే నిలచిపోయెను.

ప్రేమికులు, సకలవిద్యాపారంగతులు ఆనందైశ్వర్య సామ్రాజ్య రాజ్ఞీత్వ సముద్ధరణీయమైయొప్పు వదనచంద్ర బింబములు, నేడేలకోయట్లు విషాదమైయుండుటగాంచి, తారలపాలిటిపెన్నిధి లోకముపాలిట చల్లనిమూర్తి, మధుర

మఘయామినీ సీమకధిపతి - నాగాభరణు శిరఃకాంతిని ప్రసారించు నెలవంక, గిలిగింతలుపెట్టి, చిలిపి భాషల హృదయకుహరములను తెరచి ఏకముచేయు కలువలరాజు, ఆ విషణ్ణ హృదయద్వయమేకమై వదలు వుచ్ఛ్వాసనిశ్వాసములు తన నెచట శపించునోయను భయమంది, రయమున పర్వెత్తి, ఆర్తజన బాంధవునివోలె కన్పించిన మేఘరాజుని హృదయకుహరాంతర్భాగమున డాగికొని, కదలకయుండెను. ప్రేమికుల హృదయాలను చక్కిలిగింతలు పెట్టు నెలరాజే అట్లు దాగికొనుట వలన, యువరాజ దంపతులు మరేమియూ చేయజాలక చేష్టలుడిగ్గి; నెలరాజు పాలన యంతరించెనని తలంచి కాబోలు - ఏకచ్ఛత్రాధిపత్యము వహింప కౌతుకతో వచ్చిన నిశి పాలనలోని అంధకారమున చలువరాతి వుపవేదికపై, వారి శరీరము లొకటియై చాలకాలముండెను.

---

# 18

ప్రాతఃకాలమాయెను. అందరి హృదయములు బరువుగా నుండి, వేదనతో నిండియున్నవి. షుమారు ఎనిమిది ఘడియల ప్రాంతమునకే పట్టణ ప్రజయంతయు విపణి వీథికి వచ్చి చేరినది.

యింతలో యొక శకట మచటికి వచ్చి చేరినది. అందరి దృక్కులు ఆ శకటముపై బడినవి. రక్షకభటులు శకటపు తలుపులు తెరచిరి. అందుండి నవయౌవ్వన వసంతుడగు యువరాజు చిరునవ్వుతో మెల్లగ దిగెను. అతనిని చూచి జనసమూహము హర్ష పులకిత గాత్రముల జయధ్వానములు గావించిరి. ఆవేదనా పూరితులయిన ప్రజ తమ ప్రియతమ నాయకుని చరమదశలోగాంచి, ఒకవైపున దుఃఖాతిశయము, మరియొక వైపున, యువరాజు చిరునవ్వుదర్శనము కాగానే శృతులు పోయిన వీణ తంత్రులు సారించకుండగనే మ్రోగుచున్నవా అను దిగ్భ్రాంతి గలుగచేయుచుండెను.

అంత. మహారాజు మాధవవర్మ అపర ధర్మావతారుడై గంభీరవదనమున, రథముపై అచటికి ఏతెంచెను. అతని ముఖ చంద్రబింబమున జీవములేని చిరునగవు, కనులయందు ప్రస్ఫుటమగు ఆవేదన దృఢమై కన్పట్టుచున్నవి – అతను రాజదండము పట్టినరీతి, ధర్మదేవత అంకమున కూర్చుండెనా యన్నట్లుండెను. యువరాజును చూచి

"నిందితుడా, - ఆఖరు ఘడియలు సమీపించుచున్నవి. అంత్యదశలో భగవానుని ప్రార్థించుకొనుము - నీ కితరమగు కోర్కెలున్న కోరుకొనవచ్చును - పితంబ్రి శిక్షా నిర్వహణ మునకై వేచియున్నాడు.

"ఒకటే కోర్కె మహారాజా - పుత్రశోకమున పరి తప్తులుగాక రాజ్యమును, ధర్మమును కాపాడవలయునని నేర స్థుని యంత్య కోర్కె -

అని ప్రజదెస గాంచి, నమస్కరించి - "మీ ఆదరాభి మానములకు కృతజ్ఞుడను. ఆవేదనతో దుర్బలులు కాకుడు - విష్ణుకుండిన వర్ధన వంశజులు అధర్మవాదులను అపకీర్తిగాని - మాధవవర్మ పక్షపాతియను అపవాదుగాని యిపుడు లేవు - సామ్రాజ్య రక్షణకై నిరంతరము పాటుపడుడు - అదే నాకు ఆత్మ శాంతి - శ్రీ మాధవవర్మ మహారాజునకు జై - యన ప్రజా సమూహముచూ జయధ్వానములు గావించిరి.

యింతలో యువరాణి మెల్లన యటకు వచ్చెను. ఆ శోకమూర్తిని గాంచిన హృదులన్నియూ అపశృతులు పలుకు చున్నవి - ఎంత కష్టము - నూత్న జిగీష - అంతయు తదు పరి ఘడియలో అంతము కానున్నవి కదా - ఆమె నెమ్మదిన యువరాజును సమీపించి, ప్రణమిల్లెను. అతని నుదుటను కుంకుమదిద్దెను. యువరాజు ఆమెతో మాటాడుట కిచ్చగింప లేదు -

"మహారాజా ఆలస్యమెందులకు - సంసిద్ధుడను."

మాధవవర్మ కొంతదూరము వెనుకకుపోయెను. ఆకసము వంక తిరిగి రథమధిరోహించెను. ధర్మ సంస్థాపనార్థము అవతరించెడి భగవానునివలె కోటిసూర్యప్రభలతో వెల్గొందుచుండెను. యొక అనిర్వచనీయానందము, క్రొంగొత్త కాంతి అతని ముఖమున కన్పట్టుచున్నవి.

యువకుడు మరణమందిన స్థలమున యువరాజు వరుండెను. ధర్మ సంరక్షణమనిన ఆ వంశమున కెంత సంతోషము ముహూర్తము దగ్గరగుచుండెను. సేవకులు సమయమును సూచించుచూ, శంఖనాదములు గావించిరి. ప్రజా హృదయములు దడదడలాడినవి. తమ నాయకుని రక్షింపుమని ఆకసము వంక దిరిగి ప్రార్థనలు సలుపు చుండిరి - వీరి ప్రార్థనల నంగీకరింప నశక్తుడై, కృష్ణభగవానునికి సైతము గీతోపదేశము గావించిన అర్క మహాశయుడు ఈ దారుణ కృత్యమును చూడలేక కనులు మూసికొనెనా యనునట్లు, మేఘముల చాటునకు పోయెను.

రథము కదలెను. భయవిహ్వాలులై ప్రజలు ఏక కంఠమున——

"మహారాజా - ఈ హింసాకాండ నాపండి" అని అరచిరి. ధర్మసంస్థాపనా నియుక్తుడైన మాధవవర్మ కర్ణముల కిది సోకలేదు. యువరాజులు ప్రజదెసచూచి వ్యగ్రదేకులు కాకుడు అని మనవి చేసిరి.

రథము దగ్గరాయెను - అందరును ఆవంక చూసిరి -

అశ్వములు విలయనృత్యము చేయుచున్నవా యనునట్లు, భయంకరముగా సకిలించుచు గంతులువేయుచున్నవి. ఏమిది- ఒక మహాపురుషుడు తెలియక జరిగిన పొరపాటుకు మరణ మందుటయూ, అందునూ పట్టాభిషేక శుభసమయమునా, ఏమది-ఎంత హృదయవిదారక సన్నివేశము -

రథము మరింత దగ్గరకు వచ్చెను. అందరిదృష్టులు మాధవవర్మపై నిలచినవి. అతడు చలింపకయుండెను. మాధవ వర్మ యువరాజు వంక నే దృష్టియూ సారించక యుండెను.

*　*　*　*

రథము యువరాజును దాటి పోయినది. యువరాజులు ఆ బాధను చిరునవ్వుతో ఓర్పుతో సహించిరి. ప్రజ భయ కరమైన ఈ దృశ్యమును చూచి హాహా కారములు సల్పిరి. పట్టాభిషేక జయోత్సవం - మరణశిక్ష - విపరీత విచిత్ర సంఘటన - చారిత్రాత్మక ప్రసిద్ధము.

యువరాజ శరీరము రెండు తుండెములాయెను. యువ రాణీ అతని పాదములపై బడి మూర్ఛిల్లెను. అంతలో మహా రాణి, యటకు వచ్చి భయోత్పాతమూ, రుధిర ప్రవా హమూ చూచి - ఒకే కేకతో శవముపై బడి మూర్ఛిల్లి నది. ఆనందోత్సాహ శుభసమయము దుఃఖతప్తమయినది - ప్రజలు అశ్రు ప్రవాహమున తేలియాడుచుండిరి. రోదన ధ్వనియు, గిట్టల శబ్దమూ తప్ప మరేమియూ వినబడుటలేదు.

యింతలో గిట్టల శబ్దము ఆగిపోయినది. గుర్రపు ల

సమయములో నుంచుకొనుసరికి కొంతసమయము పట్టినది. రథము దిగి తన కుమారుని అవలోకించుటకై, పర్వెత్తి వచ్చెను. కుమారుని వుత్తమాంగము రక్తమున తేలియాడుచుండెను. ఆ రుధిరప్లావిత బింబమున చిరునవ్వు తాండవమాడుచుండెను. అంతవరకు గాంభీర్యము నటించుచున్న మాధవవర్మ నిలువ లేకపోయెను. సామాన్య మానవునివలె రోదింపసాగెను. మహా మంత్రి అచటకు వచ్చి అతి కష్టమున మహారాజు నోదార్చ గలిగెను - శర్మా - అని అతనినిచూచి కౌగలించుకొనియెను.

న్యాయమూర్తిగా అతనికి విచారములేదు - కాని తండ్రిగా పుత్రశోకమును భరింపలేకపోయెను. కలియుగమున కూడా యింత ధర్మనిరతియా -

మాధవవర్మ దుఃఖోపశమనము కావించుకొని- దుర్గా ప్రార్థన కారంభించెను సామూహికమునందెవరికి తోచిన విధమున వారు ప్రార్థనలు సలుపుచుండిరి.

---

# 19

"అమ్మా అన్నపూర్ణా ఏమిది - విశ్వ విశ్వంభరా భారమును భుజస్కంధముల నుంచుకొని ప్రజను కన్నబిడ్డల వలె పాలించు నాకా పుత్రశోకము - శివా - ఈశ్వరా- పార్వతి శోకమును బాప ప్రమథ గణాధిపాధుని బ్రోచినట్లు, నన్ననూ పాలింపుము - రుద్రాణీ కాత్యాయనీ - నీ కరుణాపూరిత హస్తముల నన్ను బ్రోవుము - మంగళగౌరీ, మహాకాళీ, జగజ్జననీ, హైమవతీశ్వరీ - ప్రేమ స్వరూపిణివైన పవిత్ర ప్రేమతత్వము సామాన్యులకు తెల్ప అర్ధ శరీరవైన ఉమాదేవీ - శర్వాణీ - దయామయీ నన్ను కాపాడుము - మంగళప్రదమయిన నీ ముఖారవిందపు జ్యోత్స్నా కాంతుల నీ దీనునిపై ప్రసరింపుము తల్లీ - మహామాతా మానవకళ్యాణార్థం అవతరించిన మహామాయా నీపాలనలోనే యరిష్టమూ, పొరపాటున నయిననూ అధర్మమునూ, అనృతమునూ ఎసగను. చాముండీశ్వరీ - నీ ఆనతితో పాలింపబడు మాధవవర్మ పాలనలో నీ బిడ్డల హాహాకారములా-మహాదుర్గా, మనుజుల వలననే గాక, నోరులేని జంతువుల వలన కూడా అంబా యన్పించుకొను నీ మృదుమధురమూర్తిని మాపై ప్రదర్శించుము తల్లీ - సస్య సంపదున్మూలితం చేయ సమకట్టిన మహాకాళీమూర్తి మంత్వమున ఈభూమి బీడువారి పోవలసినదేనా ఆంధ్రమాత భర్త లేని యనాధ అవవలసినదేనా - మహిషాసుర మర్దనీ మహాంధ్ర సామ్రాజ్యము పతనము కావలసిన

దేనా - ప్రపంచశాంతిని బరగచేసిన భవానీ - శంభరా సురుడిని వధించిన శాంభవీ - నిరతమూ నీ నామస్మరణతప్ప అన్యమెరుగని నాకూ నా బిడ్డలకు - మహాకాళీ ప్రదర్శనమూ - అర్ధనారీ ప్రదర్శనమూ - యిక బ్రతుకజాలను.

ఉమాకాత్యాయనీ గౌరీ కాళీ హైమవతీశ్వరీ
ఆర్యాదాక్షాయణీ చైవ, గిరిజామేనకాత్మజా,
శివా భవాని, రుద్రాణి, శర్వాణి సర్వమంగళా,
అపర్ణా పార్వతీ దుర్గా మృడాని చండికాంబికా॥
అనుచు స్తుతి సలిపి, శోషిల్లి పడిపోయెను.

యింతలో ఆకసమునుండి వీనులు భరించలేని నాదమున, కోటిసూర్య ప్రభాభాసమయిన. సామాన్యమానవులు కాంచలేని కాంతియొక్కటి - ఆకసమే విరిగి ప్రజా సమూహముపై బడెనా యన్నట్లు, మాధవవర్మ పైభాగమున నిలుచుండి, గంభీర ప్రేమపూరిత స్వరమున -

"మాధవవర్మ మహారాజా - నీదగు పవిత్ర ధర్మ నిరతిని, పరీక్షించుటకై, లోకాన ఆ ధర్మకీర్తి చిరస్థాయి నొనర్చి దిగంతవ్యాప్త మొనర్చుటకై నేనే ఈ కార్యమున కొడిగట్టితిని - వత్సా - నీ న్యాయవాక్య పాలనకు నా మానసమానంద భరితమైనది. నీ పుత్రుని మరణమునకు నీవు కాదు కర్తవు. నీవు కేవలము నిమిత్త మాత్రుడవే - జీవుల కర్మ ననుసరించియే ఆద్యంతము లమరుచుండును - కనుక జ్ఞానోదయమందుము. అని యాతని నాశీర్వదించి యాతనిపై కనకవర్షము కురిపించెను.

# 20

అంతకు పూర్వము ప్రాచీనమున బేజవ అను పల్లెగా - విజయుని, విజయకారణమున విజయపురియై, దరి వాటాఖ్యపురమై, ఆంధ్ర రాజధానియై, - మానవులనే దేవతలను గూడా నైతికబలమున గెల్చిన వాడగుట మాధవవర్మల కాలమున విజయములకు వాటిక యను సుస్థిరమయినది. ఇదియే పాశ్చాత్యుల కాలమున బెజ డ ప్రాముఖ్యతనందినది.

నాటినుండి దుర్గ, కనకవర్షము కురిపించిన దగుట కదుర్గమై భక్తుల బ్రోచుచున్నది.

---

కట్టెలగుండి—

కట్టెదురన్ దనపట్టి తెచ్చి య
ప్పట్టున జంపి చిత్రమని
భర్గుడు మెచ్చి, సువర్ణవృష్టి య
ప్పట్టణ భూమిలో గురియ
బంచెను—మాధవవర్మ పాడిపెం
పెట్టిదో యంచు నింద్రుసభ
బేర్కొనిరప్పుడు దేవసంఘముల్.

"ఆ యతకీర్తి సజ్జనకులాగ్రణి మాధవవర్మ చింతలం
గాయలుకోసి యమ్ముకొను కట్టెలగుండి తనూజు చావ
శ్రీయుతుడైన పుత్రుతల చేతికినిచ్చె బెజాడపాడె నా
పాయక నిల్చె వార్ధిశశిబాణ శకాబ్దములైన కాలమున

ప్రాచా. ప. మ. మం. 2



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA129B128 |
| పుస్తకం పేరు | రాజా మాధవవర్మ |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 151 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Navya |
| పేజీలు విడదీసినది | Thalir |
| స్కాన్ చేసినది | Ashwini |
| పరీక్ష చేసినది | ROHITH |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |